# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను వెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

ఏప్రిల్, 1948.

సంపుటము ౧౭]        [సంచిక ౪




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుడుండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక





యశస్సాంద్ర రావుబహద్దూరు
కందుకూరి వీరేశలింగం పంతులుగారు
(1848—1919)





కీర్తికాంత
కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారు
(1852—1910)



జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# శ్రీ వీరేశలింగ శతవార్షిక వర్ధంతి



శ్రీ వీరేశలింగం పంతులుగారు జన్మించి ఈ ఏప్రిల్ నెల 16 వ తేది నాటికి నూరేండ్లు నిండుచున్నవి. కావున నేడాంధ్రదేశమంతటను ఉత్సాహముతో వారి శతవార్షికవర్ధంతి యుత్సవములు జరుపబడుచున్నవి.

శ్రీ పంతులుగారు జన్మించిననాటి కింకను మనదేశమును విక్టోరియారాణి తన పాలనలోనికి గైకొనలేదు; దేశీయులింకను 1857 సం॥న తిరుగుబాటున కుద్యుక్తులై యుండలేదేమో! అయితే ఆ గాథలన్నియును వారికి 10, 12 సం॥లు వచ్చులోపలనే గడచిపోయినవి. భారతదేశమునకు దాస్యశృంఖలములు దిట్టముగా పెనబడి బిగిసిపోవుచుండినవి. కాని ప్రాచీన సంస్కృతికలిగి పదుగురిలో ప్రౌఢయై వర్ధిల్లిన భారతమాత శాశ్వతముగా బానిసగా పడియుండునా? లేదు. దాస్యభారమున క్రమముగా క్రుంగిపోవుచున్ననూ- ఆమె ఆపరిణామదశలో- తిరిగీ స్వాతంత్ర్యమువహించి చెన్నారవలెనన్న ఆర్తితో అవశయై

ఘూర్ణిల్లినది. అప్పుడామె యందలి అంతశ్శక్తులన్నియు ఒక్కసారి కదలబారినవి. దానితో దేశమందక్కడక్కడ కొంతమంది ప్రతిభాశాలు రుద్భవించి భవిష్యదున్నతికై వివిధోద్యమముల బీజములనాటిరి. అట్టివారిలో శ్రీ వీరేశలింగం పంతులుగారొకరు.

కావుననే ఆయన సర్వతోముఖముగ విజృంభించి సకలోద్యమముల నడిపినారు. సంఘసంస్కరణము, స్త్రీ జనోద్ధరణము, విద్యావ్యాపకము, సులభవచనగ్రంథరచన, పత్రికాప్రచురణము, చారిత్రక పరిశోధనము, లంచగొండితనముపై యుద్ధము, విగ్రహారాధనా నిరసనము, ఏకేశ్వరోపాసనము, ఇట్లెన్నైన నెన్నవచ్చును. ప్రభుత్వపు మన్ననయు బడసి రావు బహదూర్ బిరుదమందినారు. వేయేల? నాటికి ప్రజానాయకుని కుండవలసిన వన్నియు కల్గి అందరికి మిన్నయైమెరసినారు. ఇందుకై నాడుకావలసిన ధైర్యము స్థైర్యము, త్యాగము సాహసము, చొరవ చాకచక్యము, అన్నియుప్రదర్శించినారు.

100 సం॥లు గడిచినవి; నేడు వెనుకకు తిరిగి చూచుకొని నాటికి నేటికి ఎంతగా పురోగమించినామని యోచించుచో, కొన్నిట కొంత కొంత ముందుకు సాగిపోయినామేమోగాని చాలవాటిలో స్థాణువులమైయే యున్నామని తోచకమానదు. అయితే నాటికి నేటికి భేదమున్నది. నాడు స్వాతంత్ర్యము- ఏ రూపముననైన నేమి, బహు కొద్ది మంది సంకల్పబీజమునందలి మొలకమాత్రమే. నేడది సిద్ధించి, ఫలించిన కల్పవృక్షము. కావున భారతీయసంతానములు ఆ పండ్ల నారగింపవలెనంటే, వారి నందుకర్హులగావింపగల, వీరేశలింగంగారివంటి సేవాదీక్షితులు నేడును పలువురు కావలయును. ఇన్నాళ్లును రాజకీయములకై పోరాడిన త్యాగులు, సాహసికులు అందుకు చాలరు. వారువచ్చిన అధికారమును చేబట్టి చలాయించుటకు పరుగులు వారుచున్నారు. కావుననే గాంధిమహాత్ముడు "లోకసేవకసంఘ" మేర్పడవలయునని తుది ఘడియలలో వ్రాసి యుంచినాడు.

నేడు శ్రీ పంతులుగారి శతవార్షికవర్ధంత్యోత్సవ వ్యాజమున ఆంధ్రజాతి కట్టి స్త్రీపురుషులు కావలెనన్న ఆర్తి కల్గుగాక.

# సంస్కరణపరాయణమైన కుటుంబము

శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారే స్వయముగా నొక్కచో-సంఘసంస్కరణోద్యమమున తమకుటుంబముపడ్డ పాట్లనుగూర్చి ఇట్లుచెప్పినట్లు మా మిత్రులొకరు వ్రాయుచున్నారు :—

అస్పృశ్యతాదికములను నేనెన్నడును పాటించక పోవుటయేగాక నాభజనలందును వీధి పెంగళ్ల ఉపన్యాసములందును, గ్రామసంచారములందును ఈ విషయమై ప్రచారము చేయుచుండేవాడను. ప్రసిద్ధ విల్లివాకంహత్యకేసులో హత్యగావింపబడిన శ్రీ ముత్తరాజు వెంకటకృష్ణయ్యగారు తమకుమార్తెను బాలవితంతువునకు వివాహముచేసియుండిరి. వారు మా (నెల్లూరు) జిల్లావాసులు; కాని వారిబంధువులందరు వారిని బహిష్కరించుటచే వారిని 1914 లో కావలికాహ్వానించి కొందరుమిత్రులతో కలిసి వారితో విందారగించితిని. గ్రామస్థులు మమ్ము బహిష్కరించి శ్రీ పుష్పగిరిపీఠస్థ శంకరాచార్యస్వామి వారికి వ్రాసి వారిచే మా కాంక్షపత్రికలపంపించిరి. నేనున్నూ మిత్రులతో చేరి ఇందుకుప్రతిగా స్వామివారికే ఆంక్షపత్రికలు



పంపితిని. వారిపెత్తనము నధిక్షేపించుచు బహిరంగసభల ప్రచారముచేసి తీర్మానములచేయించితిమి. గ్రామగ్రామమునుండి చేవ్రాళ్లుచేయించి వారిఅధికారము నధిక్షేపించుచు రిజస్టరునోటీసు లిప్పించితిమి. వారికి దిక్కులు తోచకుండచేసితిమి. ప్రజాభిప్రాయము నావంకకే మొగ్గినది. పిదప ఒక్క మావదినెగారు-(నాభార్య అక్కగారు) తప్ప మిగతబంధువులందరు మాయింటజరిగిన ఉపనయనములకు, పెండ్లిండ్లకువచ్చిరి. మిత్రులందరు వచ్చిరి.

తరువాత మాకుటుంబముననే (కుమారుడు వేంకటేశ్వరశర్మకు) 1934లో వితంతూద్వాహ మొనర్చితిని. ఆ వివాహము చెన్నపురిలో నాగేశ్వరరావు పంతులుగారింట జరిగెను. నా బంధువులందరువచ్చిరి. వధువు బంధువులందరు వచ్చిరి. సామాన్యవివాహమువలెనే జరిగిపోయినది. పూర్వాచారపు వైదిక పద్ధతినే సాగిపోయినది.

(ఈ వెంకటేశ్వరశర్మ కాశీలో హిందీసంస్కృతములు చదివినపండితుడు; షడ్దర్శనవేత్త. 1943లో, హఠాత్తుగా స్వర్గస్థుడై తల్లిదండ్రులను బంధుమిత్రులను దుఃఖసముద్రమున ముంచివైచెను. గృ॥ స॥)

# వీరేశలింగం అడుగుజాడలలో



కందుకూరి వీరేశలింగపంతులుగారి తరువాత మనఆంధ్రరాష్ట్రములో ఆయన యొక్క సంఘసంస్కరణను మనస్సులోపెట్టుకొని అనాధస్త్రీల భావిభాగ్యోన్నతికి పాటు బడుచున్నవ్యక్తి శ్రీఎ. ఎస్. చెట్టి బి.ఏ గారొకరు. వీరు కీ. శే. ఎ. వెంకట్రామన్ బారిష్టరు (మహాత్మాగాంధిగారి మొదటిశెక్రటరీ) గారి సోదరులు. వీరు 1933 సంవత్సరములో మదరాసు లైలాకాలేజిలో బి. ఏ. ప్యాసుఅయినారు. మదరాసులోనే బి. ఏ. చదువు చుండగానే అప్పుడు హైకోర్టు చీఫ్‌జస్టిస్ సర్ ముత్తా వెంకటసుబ్బారావు దంపతులతో కలసి స్త్రీసంఘోద్ధరణకు పాటుబడినారు. బి.ఏ ప్యాసుఅయినతరువాత 1934 సంవత్స రములో వీరి స్వగ్రామం నర్సాపురం వచ్చిన తరువాత స్వార్థముకోసమై ఏయుద్యోగము ఆశించక హిందూస్త్రీ పునర్వివాహసహాయక సంఘము స్థాపించి ఇప్పటివరకూ కొన్ని వందల వివాహములు యీ సంఘములో జరిపించినారు. ఇప్పటికి దాదాపు 12 సంవత్స రములనుంచి యీ సంఘము అభివృద్ధిగాంచేలాగున పాటుబడుచున్నవ్యక్తి. వీరు యిప్పుడు భవననిర్మాణములకు డిస్ట్రిక్టుబోర్డువారు ఉచితముగా ఇచ్చిన సైటు 2512 చ॥ గజాలలో దాదాపు 75 వేల రూపాయలతో భోజనవసతిగృహములు, విద్యానిలయము కట్టించుచున్నారు. దాదాపు పనులు పూర్తిగావచ్చినవి. స్త్రీలకువిద్య, మరియు పరిశ్రమలు మొదలైనవి వచ్చేసంవత్సరమునుంచి ప్రారంభించుదురు. ఈకార్యనిర్వాహణ మంతయు శ్రీ ఎ. ఎస్. చెట్టిగారు స్థాపకులుగా కాక యీపన్నెండు సంవత్సరముల నుంచి కార్యదర్శిగానేయుండి సంఘోద్ధరణ కొరకుపాటు బడుచున్నవ్యక్తి, ఉదారమూర్తి, పవిత్రహృదయంగలవ్యక్తి. ముఖ్యముగా తాను వివాహమే చేసుకొనుటమాని అనాధ స్త్రీలభావి ఉన్నతికోసం, పాటుబడుచున్నారు.

ఎ. ఆర్. కోటి

---

## మనవి

చందాదారులు విలాసములు మారినప్పుడు చందాలు పంపునప్పుడు, ఇతర సందర్భములయందు వారిచందా నెంబర్లు తెలియపరచిన వెంటనే సమాధానములు బడయుటకు వీలగును.

---

# నా జీవితంలో వీరేశలింగంగారి ఒక కళ



నా చిన్నతనంలో రాజమండ్రి వెళ్లాను. అక్కడ మావాళ్లయింట్లో శ్రీ వీరేశలింగం పంతులుగారి మాటలు, వెధవవాండ్ల పెండ్లిండ్లు, వాళ్లకు చదువులు, అని ఏమేమో వింతగా చెప్పుకున్నారు. అదిలగాయతు మనంకూడా అలా చేస్తేబాగుండదా! అనుకొనేదాన్ని. కాని ఎప్పటికైనా చేస్తాననిమాత్రం ధైర్యం కలుగుతూండేది.

యింతలో నాభర్తగారి ప్రోత్సాహంవల్ల తుర్లపాటి రాజేశ్వరమ్మగారి సహవాసమువల్ల కొంతసంఘ సంస్కరణాభిలాష కలిగింది. 1929-30 సం॥ ములలో రాజమండ్రిలో ట్రయినింగుకోసం ఉన్నాను. అప్పుడు శ్రీ పంతులుగారితోటలో జరిగేవితంతూద్వాహాలకుతరచువెళ్లుచు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి ఉపన్యాసాలు కూడా వింటూండేదాన్ని. యిక వితంతువుల సేవయందే నామనసు ఉప్పొంగిపోయేది. కాని బానిసత్వపు టుద్యోగవాంఛ నాకోర్కెను చంపేది. యిట్లాపదేండ్లు గడిచాయి.

నాకోర్కె నెరవేరుటకోయన 1941 సం॥ లో వ్యక్తి సత్యాగ్రహము వచ్చింది. యిదే అదనుకొని 1941 సం॥ లో శ్రీ మహాత్ముని ఆదేశానుసారము నా బోర్డు ప్రధానోపాధ్యాయినీ పనికి రాజీనామాపెట్టి వ్యక్తి సత్యాగ్రహముచేసి బానిసత్వమును బాపుకొంటిని.

నా చిరకాలవాంఛితమును నెరవేర్చుటకు 1942 సం॥ లో నర్సాపురం స్త్రీపునర్వివాహ సహాయ సంఘమునకు గౌరవహోమసూపరెంటెండెంటుగాయుండి కమిటీసహాయంతో సుమారు రెండువందల వితంతూద్వాహములు, కొన్ని అంతర్వర్ణ వివాహములు చేయగలిగితిని.

పశ్చిమగోదావరి జిల్లాబోర్డువారి స్థలము నర్సాపురం, రాయపేటలో సుమారు 1720 చ॥ గ॥ శ్రీ బోర్డుఅధ్యక్షులు శ్రీ గ్రంధివెంకటరెడ్డినాయుడుగారి వలన ఉచితముగా సంపాదింపగలిగితిమి.

కొన్ని అభిప్రాయభేదములుగలుగుటచే 1946 సం॥ నుంచి నేను ఆపనివదిలివేసితిని గాని సందర్భానుసారముగ వితంతూద్వాహములు చేయించుటలో తోడ్పడుచు శ్రీ పంతులుగారి ఆశయమును, నాజీవితాంతం వరకు నెరవేర్చే సంకల్పము నాకు ప్రసాదించుటకు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

అయ్యదేవర బాలత్రిపురసుందరమ్మ.



# స్త్రీ జనోద్ధారకులు

మొదట 18 వ శతాబ్దంలో స్త్రీలఔన్నత్యానికి పునాదివేసినవాడు రాజారామమోహనరాయ్. కాని సాంఘికక్లిష్టపరిస్థితులు బాగుగవేళ్లు పారి బలిసియుండుటచే అతను సఫలీకృతుడు కాజాలకపోయెను. 19 వ శతాబ్దంలో కందుకూరి వీరేశలింగంపంతులుగారు, విధవావివాహాలుజరిపించి కొంతవరకు దాన్ని ఆచరణలో పెట్టగలిగినారు. అయితే ఈ 20 వ శతాబ్దంలో మనమహాత్ముడు దాన్ని జయప్రదంగాజరిపించి స్త్రీలను రాజకీయరంగమునందు పాల్గొనునట్లుజేసెను.

టి. వి. రత్నావళి.

శ్రీమతి

దేశిరాజు భారతీదేవిగారు

## "ఘనుడు వీరేశలింగ విఖ్యాతి ధనుడు"

ఆంధ్రభూమికి భూషణంబై దనర్చు
రాజమహేంద్రపురమున రహివహించి
తెలుగువారికి సంసేవ సలిపినాడు
మహిత వీరేశలింగాఖ్య మహిని వెలయ.

వెలదులకు న్విద్య వలదంచు వాదించు
మొఱకులతో నెల్ల బోరి పోరి
బాలవితంతు వివాహముల్ వలదంచు
చెప్పెడు వారల తప్పుదిద్ది
వాగ్వీర మాత్రులౌ వారి నాచరణకై
నిరతప్రయత్నముల్ నెఱపి నెరపి
గద్యపద్యాత్మక హృద్యకావ్యములచే
సంతత ధర్మ ప్రచారమూని

సంఘమొకరీతి మార్పగాజాలినాడు
మడుగుబట్టను గల మసి దుడిచి నాడు
కార్యశూరుడు ఘనదేశికవివరుడు
ఘనుడు వీరేశలింగ విఖ్యాతి ధనుడు.

శతవత్సరంబులయ్యెను క్షితినాతండుద్భవించి చేసినసేవల్
మృతజీవుడగుట నేడీగతి శతవర్ధంతి జరుపగా దగు మనకున్.



# త్యాగి వీరేశలింగం



శ్రీమతి లక్ష్మీదేవిగారు

తన దేహము తనగేహము
తనకాలము తనధనంబు తనవిద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘను డీవీరేశలింగకవి జనులారా.

వీరేశలింగంపంతులుగారు ఆంధ్రదేశమున జన్మించి ఆంధ్రుల నవీనాభ్యుదయమునకు మూలకారకులైరి. పంతులుగారు విద్యావంతులు. వారుతమవిద్యను ధనమార్జించుటకు వినియోగించినను తుదకు ఆ ద్రవ్యమును ప్రజలఅభ్యుదయమునకే సమర్పించిరి. 'పరోపకారార్థమిదంశరీరం' అనువాక్యోక్తిని పంతులుగారు పూర్తిగా సాధించిరి.

ఆ కాలమున హిందూస్త్రీలయందు విద్యావ్యాప్తి చాలాతక్కువ. ప్రాచీనసాంప్రదాయము నవలంబించడం చాలాఅలవాటుగానుండెను. ముఖ్యంగా హిందూబాలవితంతువులు తమజీవితములను గడుపుటకు దారితెలియక దుఃఖాంబుధిని గడుపుచుండిరి. సంఘముపేర దురాచారములు ప్రబలియుండెను. వితంతువులను సంఘము వెలిబెట్టుచుండెను. ఇరుగుపొరుగువారు వారిని బహుహీనముగా చూచుచుండిరి. వితంతువులు తమపూర్వార్జితపు కర్మనుదూరుచు, జీవన్మృతులుగా ఇతరులకు తమమనోదుఃఖము వెలిబుచ్చలేక కాలముగడుపుచుండిరి. మహాపురుషులు భూమిమీదజన్మించుటకు సరియగు అవకాశములుగల్గెను. హిందూ బాలవితంతువులను రక్షించుటకై మహాపురుషుడు వీరేశలింగంగారు ఆంధ్రదేశమున యవతరించిరి. వితంతువులయొక్క కష్టములు తెలిసి పంతులుగారువగచి, వారినికాపాడుటకు నడుముకట్టినిలచిరి. విద్యనేర్చిన గాని ఈమూఢత్వం వారిని వదలదనితలంచి కొంత ప్రచారము సాగించినపిదప ప్రత్యేకపాఠశాలలేర్పరచి ఉచితవిద్యనేర్పించిరి. వారికి శరణాలయములు కట్టించి వారినిపోషించుచు వచ్చిరి. క్రమముగావారు విద్యనేర్చుకొని మానసికవికాసము కలుగచేసికొని దేశవిదేశపరిస్థితులు తెలిసికొనుటకు యోగ్యతకలవారైరి. పంతులుగారుచేపట్టి సాధించుకార్యముయొక్క యదార్థమునుగ్రహించక విద్యావంతులగుపురుషులే పంతుల వారిని బహిష్కరించిరి, దూషించిరి. అనేకఇబ్బందులుసహా కలుగచేసిరి. ఎన్నిఇడుములు సంభవించినను పంతులుగారు తమ మనోధైర్యమును వదలక తానుతలపెట్టిన కార్యమునే తనలక్ష్యమునందుంచుకొని ఏకదీక్షతో సాధించారు. వితంతువివాహములుకూడా పంతులుగారు తమ స్వంతగృహమునందే సల్పిరి. హిందూ సంఘమును పాడుచేయుచున్నారని ప్రజలువారిని దూషించిరి, నిందించిరి. వారులక్ష్యపెట్టలేదు.

పంతులుగారు బాలికలకు యుక్తవయస్సు వచ్చినగాని వివాహములుచేయకూడదని దానివలనకలుగు, కష్టనష్టములు ప్రజలకు నచ్చచెప్పిరి.

వీరేశలింగంపంతులుగారు విగ్రహారాధనను ఖండించిరి. అయితేకొంతవరకు విగ్రహారాధన మనస్సును నిల్పుటకు తోడ్పడుననియుచెప్పిరి.

మానవసేవయే మాధవసేవయని, పంతులుగారు ప్రజలకు సహాయపడుటకే తాముజీవింప నిష్టపడిరి.

# భాగ్యలక్ష్మి రాజ్యలక్ష్మి"

చెన్నపురిలోనుండు దినములలోనే నాకు రాజ్యలక్ష్మిగారితోడి పరిచయము లభించెను. రాజ్యలక్ష్మమ్మ పతి కనుకూలవతియగు సతీతిలకము. భర్త రుచులకుఁదగిన యాహారపానీయము లెప్పుడెట్లు సమకూర్పవలయునో గ్రహించి యట్లుచేయుచుండెడి సాధ్వీమణి. ఎందయోపొదుపు మెలఁకువలతో నింటిపనులు చక్కపెట్టుకొనుచుండును. ఆ వినయవతి యెంతజాగరూకతతోఁ బాటుపడుచుండినను, చిన్నలోపములకై యామె మీఁద పంతులు చీటికిమాటికి చిఱచిఱలాడుచుండును. శాంతమువిడువక, పతికనుకూలముగ ప్రత్యుత్తరములిచ్చి, ఆ మానిని పనులు చేసికొనుచుండెడిది. పంతుల కటువద ప్రయోగముల కామె కనలక, కవినోటినుండి వెడలు పరిహాసోక్తులసొంపు గ్రహియింపనేర్చిన సరసురాలు. తానున్నతవిద్య స్వీకరింపకున్నను, విద్యాధికతగలవారి సహవాససంభాషణముల స్వారస్యముగనిపెట్టి మెలఁగుచుండెడి వివేకవతి. కోపస్వభావముగల పంతులు మసలెడి యాయింట, మాటమంచియు, మనసుమెత్తనయుఁగలిగి శాంతిసమత్వములు నెలకొలుపుటకే తెంచిన భాగ్యలక్ష్మివలె రాజ్యలక్ష్మి విలసిల్లుచుండెను!

* * * *

నేను విజయనగరమున నుండుకాలమున నొకప్పుడు వీరేశలింగము పంతులుగారిని జూచుటకు రాజమహేంద్రవరముపోయితిని. అపుడు వారును రాజ్యలక్ష్మమ్మగారును నేదోవాగ్వాదమున నుండుటచేత, ఇట్టి యసమయమున నేల వచ్చితినని నొచ్చుకొంటిని. తన మరణశాసనమో, మఱియేకాగితమో, వ్రాయుసమయమున, రాజమంద్రిలోని రెండిండ్లను ఆమెకోరినదనియు, తా మందుల కంగీకరింపలేదనియు పంతులుగారు తమ వివాదసందర్భము నాకుఁదెలియఁ బఱచిరి.

"మీరేమియిచ్చుట కంగీకరించితిరి?" అని నేనడిగితిని.

"నేనొక యిల్లేయిచ్చెదను!" అని వారనిరి.

"ఆజన్మమును మీ సేవచేసి, సంస్కరణ మహాకార్యములలో మీకుఁ జేదోడు, వాదోడునై నిలిచిన యీ పుణ్యవతి కింకొక గృహమిచ్చుట మీకొక కష్టమా?" అని నేనంటిని.

"తా నొకతె యనుభవించుట కిన్నియిండ్లేల? దీనిరహస్యము, మమ్మువిడిచివైచిన తన కృతకపుత్రుని కొక యిల్లీమె యీయఁదలంచుటయె సుమీ!" అని పంతులు భార్యనెత్తిపొడిచెను.

(వెంకటశివుడుగారి శ్రీ వీరేశలింగ సంస్మృతినుండి.)

# ఆదర్శ దంపతులు



శ్రీమతి దరిశి సుభద్రమ్మగారు.



ఆంధ్రావనిలో అంధయుగమది. మధ్యయుగం, కాలగర్భంలో మునిగి పోతున్నది. ఇంకనూ నవ్యాంధ్ర అరుణోదయం ప్రారంభంకాలేదు. అది యుగసంధి. జాతిమతకుల వైషమ్యాలు, అతిబాల్య, వృద్ధవివాహాలు, నిర్బంధవైధవ్యం బహు భార్యాత్వం, పడుపువృత్తి, లంచగొండితనం, అది ఇది అనడమెందుకు, అవిద్య, అజ్ఞానం, అవినీతి అసభ్యత, అన్యాయం, అకృత్యాలు తలవిరియబోసుకొని చిందులు త్రొక్కుతున్నవి. అనాథుల, అమాయకుల, ఆర్తనాదం మిన్నుముట్టుతూంది. అలాంటి అంధసమాజంలో, అమరజ్యోతిని వెలిగించడానికీ, నవ్యాంధ్ర నిర్మాణమునకు పునాదివేయటానికీ, పుణ్యదంపతులు శ్రీ వీరేశలింగం రాజ్యలక్ష్మిగార్లు బయలుదేరారు.

పంతులుగారికి పన్నెండవఏట, రాజ్యలక్ష్మికి ఎనిమిదవఏట, వివాహం జరిగింది. వీరేశలింగం మహామేధావి; సంస్కృతాంధ్ర సారస్వతంలో ప్రారంభంనుండే పాండిత్యం సంపాదించసాగాడు. అతిబాల్యంలో అనగా నాల్గవతరగతిలో చదువుతున్నప్పుడే మార్కండేయగోపాలశతకాలను రచించగలిగాడు. పంతులుగారికి ప్రజ్వలితమైన ప్రతిభాశక్తితోపాటు అత్యంత కరుణార్ద్రహృదయంకూడ వుండేది.

ఇక రాజ్యలక్ష్మమ్మవిషయం:—'ఆడవాళ్లకు అజ్ఞానమే అమూల్యాభరణం' అనేకాలంలో చక్కగ చదువుకొంటున్న బాలిక. తల్లిలేని పిల్లయని ఆమె మేనమామ మహా గారాబంతో పెంచుతూ విద్యాబుద్ధులు గఱుపుతున్నాడు. ఎనిమిదేళ్ల ఈడుకీ రుక్మిణీకల్యాణమును ముఖస్థంచేసుకొన్నది, ఇంట్లో, రుక్మిణీకల్యాణమును బాలదంపతులచే పాడించి ముసలివాళ్లు ముచ్చటపడేవారు, బాల్యంలో తాము భార్యాభర్తలనే భావం లేకపోవచ్చును, గాని, ప్రతి ఆటపాటలలో పాల్గొంటూ ప్రారంభంనుండే ప్రాణమిత్రు లవుతూవచ్చారు. పెద్దపెరిగినతరువాతకూడా ఈపుణ్యదంపతులు ప్రజాహిత కార్య క్షేత్రాలలో పాల్గొని పాటుపడసాగారు. ఈ దంపతులమధ్య పాతుకపోయిన మిత్రత్వ మునకూ, పవిత్రప్రేమకూ, ఆదినుండి వీరిలోనున్న అనురాగపూరిత హృదయమూ, ఆదర్శములే, ఆధారభూతములు, గాని బాల్యవివాహంకాదు.

రాజారామమోహన్‌రాయి ప్రభావం పసితనములోనే పంతులుగారిమీద పడింది; సంఘ సంస్కరణకు పురికొల్పింది. మొదట, సమస్త సంస్కారములకు సారస్వతమే సమగ్రమైన సాధనం అని గుర్తించాడు. అంచేత, అందరికీ అందుబాటులోనుండి, అజ్ఞానాన్ని తొలగించటానికోసం, తేటతెనుగులో, సులభశైలిలో శతాధికగ్రంథ ములను రచించాడు. ప్రబోధించిన ఆదర్శములను కార్యాచరణలోపెట్టుట అత్యవసరమని గ్రహించాడు అంచేత, పంతులుగారు వివిధ కార్యరంగాల్లోకిదూకి సంస్కరించటానికి

సంసిద్ధులయినారు. అయితే, తన అర్ధాంగి తన్ను అనుసరించుతుందా అనే అనుమానం మాత్రం, ఆదిలో అతనికి తట్టకపోలేదు. కారణం, ఆకాలంలో కొంత విద్యావిజ్ఞానాలవల్ల పట్టువదలిననూ, పూర్వాచార పిశాచంమాత్రం అంత అవలీలగా వదలదు, రాజ్యలక్ష్మమ్మగారి విషయంలో ఆరంభంలో అంతేఅయింది. "అనాదిగావస్తున్న శిష్టాచారములనువదలి కులం, మతం, అగ్గిపాలు కావలసిందేనా? విధవలకు వివాహాలేమిటి? కులభ్రష్టత్వమేమిటి?" అనేభావాలు ఆమెను బాధించసాగాయి. అయితే పంతులుగారు మాత్రం, భార్యకు జ్ఞానోదయం అయ్యేదాక అట్టే కార్యశూన్యుడయి కూర్చోలేదు. సంఘసంస్కరణమునకు కార్యాసక్తుడయినాడు.

అచిరకాలంలోనే రాజ్యలక్ష్మిగారితో మహత్తరమయిన పరివర్తనం కలిగింది. కారణం, ఒకవైపు మహిళల దుర్భరబాధలు, మరొకవైపు తనభర్తయొక్క మానవప్రేమ, సంఘసంస్కరణదీక్ష, ఋజుప్రవర్తన అనేవి. ఈలాంటి వాతావరణంలో, అతని సాంగత్యమువలన భ్రమరకీటక న్యాయమున మారిపోయిందామె. ఇంతమాత్రమేగాదు. భర్త ఎట్టిసాహసకార్యములను చేయబూనినాసరే, ఆయన్ని వెనుకకీడ్వలేదు, పైగా, ముందుకు నడిపించేది. మహాక్లిష్టసందర్భాలలో సయితము భర్తకు తోడునీడయి పక్కబలంగావుండేది. కొన్నిదారుణమైన దురాచారములను ఎదుర్కొని పోరాడే సమయాల్లో ఒక్కొక్కప్పుడు భర్తకు చిత్తోద్రేకంకలిగేది. ఆలాంటప్పుడు; రాజ్యలక్ష్మిగారు శాంతవాక్య సుధారసములో భర్తను స్వస్థచిత్తుని చేసేది. పతిప్రవేశించిన పలువిధరంగములలోను పతితోపాటు ప్రతిక్షణం పాటుపడేది. అంచేతనే మహాసంస్కర్తకు సహభాగిని అయింది.

రాజ్యలక్ష్మమ్మగారు స్వయంగాకూడా అనేక ప్రజాహితకార్యాలు చేసింది. కొన్ని సంస్థల్ని స్థాపించింది. ఉదాహరణకు కొన్నిటిని తీసుకొనిచూద్దాం.

1. మహిళా పాఠశాలను స్థాపించింది.

2. బాలవితంతువులకు పునర్వివాహములను చేయటానికి భర్తకుతోడ్పడింది. అనేక సందర్భములలో, తానే ముందంజేసింది.

3. మహిళా ప్రార్థన సమాజమును స్వయంగా స్థాపించింది.

4. పతిత యువతీ రక్షణశాలను స్వయం కృషిచేత స్థాపించింది.

5. స్త్రీలకొఱకు, కీర్తనలను, పాటలను రచించింది.

ముఖ్యంగా వితంతు వివాహకార్యములనుండి, భర్తను మరలించమని రాజ్యలక్ష్మిని బంధు మిత్రులు పూర్వాచారపరాయణులయిన పురజనులు, తుదకు తన్నుపెంచి పెద్దజేసిన మేనమామ మొదలయినవారు బ్రతిమలాడారు. జాతిభ్రష్టుల్నిగా చేస్తామని బెదరించారు. కాని ఆవీరాంగన ఎంతమాత్రం చలించలేదు. పైగా, వారి అవివేకానికీ,

అజ్ఞానానికి నవ్వుకొన్నది. తామిరువురూ చేస్తున్న సంఘసేవ మానవసేవయందు పరమ విశ్వాసముతో నిశ్చలంగా నిలుచున్నది.

ఈ ఆదర్శ ఆంధ్రవనిత స్వయంగా, చేసిన మహత్కార్యములలో మరికొన్ని మచ్చుకు తీసుకొని చూద్దాం.

వీరేశలింగంగారు రాజమహేంద్రవరంలో స్త్రీపునర్వివాహాలు చేయించుచున్నారనే వార్త ఆంధ్రదేశమందంతటా పాకిపోయింది. దూరప్రాంతాలనుంచి దుర్ఘటప్రయాణం చేస్తూ, బాలవితంతువులు వచ్చేవారు. ఆకాలంలో రాకపోకలకు రైల్లుసౌకర్యాలు చాల తక్కువ. అంచేత ఎడ్లబండ్లలోను, కాలినడకను దినాలు, నెలలకొలది ప్రయాణంచేయాలి దారిలో దొంగలభయం. అలాంటప్పుడు గంజాంజిల్లాఅస్కాపురంనుంచి ఇద్దరుబ్రాహ్మణ వితంతువులు వివాహేచ్ఛచే, బంధుమిత్రులకు తెలియకుండా రాజమహేంద్రవరానికి బయలుదేరారు. మోటుబండ్లలోను, కాలినడకను ప్రయాణంసాగించారు. చివరకు చేతిలో కానికూడామిగలలేదు. కొంతకాలానికేదోవిధంగా విజయనగరం చేరుకొన్నారు. వీరిలో ఒకమహిళమాత్రం ప్రయాణబాధకోర్చుకోలేక అక్కడే ఆగిపోయింది. మరొక యువతిమాత్రం పట్టినపట్టువదలక ప్రయాణంసాగించి రాజమహేంద్రవరం చేరుకుంది.

మిట్టమధ్యాహ్నం. రెండుగంటలు. రాజలక్ష్మి తన భర్తచే నిర్మింపబడ్డ నూతన పురమందిర ప్రారంభోత్సవానికి తనమిత్రురాండ్రతో బయలుదేరింది. బయటగుమ్మంలో కాలుపెట్టింది. మాసినచీర, మార్గాయాసంచే వాడిపోయిన ముఖం, శుష్కించిన శరీరం, ధూళిదూసరితమై రేగిన జుట్టుతో నిలుచున్న బాలవితంతువు కనబడింది. తక్షణమే ఆయువతిని లోనికితీసుకొనివెళ్లి స్నానంచేయించి శుభ్రమైన బట్టలనిచ్చింది. ఇంట్లో అన్నంలేని సమయం. పొరుగింటికెళ్లి అన్నం తెచ్చిపెట్టింది. అత్యంత అనురాగంతో ఆమెను ఆదరించి ఆమె విచారాన్ని పోగొట్టింది. తనస్నేహితురాండ్రను మన్నించమని వేడుకొని తన ప్రయాణాన్ని మానుకున్నది. ఇంతలో భర్తవచ్చాడు. నవ్వుమొగంతో ఎదురేగి "ఏమండీమీకు ఒకశుభవార్త చెప్తానండి." అంటూలోనికి తీసుకొనివెళ్లి వితంతు యువతిని చూపెట్టింది. ఇది ఈమెకు పరిపాటి. ఈయువతియే,కీర్తిశేషులైన ఆడిపూడి సోమనాధరావుగారి సతీమణి.

అజ్ఞానం - మానసిక దౌర్బల్యముల వల్లనో, వంచకులైన పురుషుల మోసం వల్లనో, పతితలయిన దౌర్భాగ్యపు స్త్రీలనెందరినో రాజ్యలక్ష్మిగారు సంరక్షించారు. స్వయంకృషిచేత తమ ఇంటి ఎదుటి గృహంలో పతితయువతి రక్షణశాలను స్థాపించింది. అలాంటి స్త్రీలకు విద్యాబుద్ధులు గరిపి విజ్ఞాన వతులుగా చేసింది. వివాహేచ్ఛ గలవారికి వివాహంచేసి మానవతులయిన గృహిణులనుగా చేసింది. ఆమెజీవితంలో ముఖ్యంగా అయిదుగురు అనాథ స్త్రీలను సంరక్షించింది. ముగ్గురు వివాహితులయినారు. ఇద్దరిని

శిశుహత్యా పాతకమునుండి కాపాడింది. రాజ్యలక్ష్మిగారు, ఒకప్పుడు, గర్భవతిగా వచ్చిన ఒకబ్రాహ్మణ వితంతువును ప్రసవవైద్యశాలకు పంపింది. ఆవితంతువు తానుకన్నబిడ్డను వైద్యశాలాధికారులకు ఇచ్చివేయటానికి సిద్ధంగా వున్నది అనేవార్త ఆమెచెవిని బడ గానే, ఆతల్లిపిల్లలను ఇంటికి తీసుకొనివచ్చి పోషించసాగింది. ఇంతలో ఆయువతి తల్లివచ్చి తన కూతురినిమాత్రం పంపమని బ్రతిమలాడింది, అలానే ఆమెను పంపివేసింది ఆదిక్కు-లేనిబిడ్డకు ప్రేమావతి అనిపేరుబెట్టి ఎంతోప్రేమతో పెంచుతున్నది.

ఒకనాడు ఈపుణ్యదంపతులిద్దరూ, పురమందిరం ప్రక్కగా వెళ్లుట తటస్థించింది. ఆవీధిలో పెద్దగుంపు కూడివుండుట కళ్లబడింది. ఇద్దరువృద్ధవేశ్యలు కపాలం బ్రద్దలయి రక్తం కారిపోతూవున్న ఒకయువతిని పట్టుకుని పోలీసుస్టేషనువైపు నడిపించి పోతున్నారు. ఈదృశ్యాన్ని చూచినవెంటనే కరుణామయి రాజ్యలక్ష్మమ్మ బండిని ఆపి ఏమిటది అని జనులను ప్రశ్నించింది. అదిబోగంది; విటుని మోసగించినందువల్ల దానిదవడలు వాడు చితకగొట్టాడని ఎవరోచెప్పారు. ఆమెహృదయం భారమెక్కింది. వెంటనే భర్తనుచూచి "ఏమండీ! ఇట్టివారిస్థితిని బాగుచేయాలండీ మనం" అని విచారంతో అన్నది.

"మనం ముసలివాళ్లమయిపోయాం! ఏమిచేయగలం" అనిపంతులుగారు అన్నారు.

"ఎందుకా సందేహం? అధైర్య పడనవసరంలేదు. మనం మాత్రం గట్టిగా పూను కోవాలి. వెనకంజవేయరాదు. తప్పక జయుంకలుగుతుంది" అని తాత్కాలికంగా నిరాశను చూపించిన భర్తను ఉత్తేజ పరిచింది.

స్త్రీపురుష విచక్షణనుగాని, కులమత భేదములనుగాని పాటించక రాజ్యలక్ష్మమ్మ దౌర్భాగ్యులందరికీ సేవచేస్తూ వచ్చింది. ఒకమిట్టమధ్యాహ్నం, ఆకలిమంటలకు తాళుకో లేక ఒకపంచముడు సృహతప్పి వీధిలో కాలిపోతున్న ఇసుకమీద పడిపోయాడు. భర్త ఇంటిలోలేడు. ఆపంచముణ్ణి మోసుకరావటానికి సహాయంచేయమని ఇరుగుపొరుగువారిని ప్రాధేయపడింది. కానిపంచముడని ఎవరూదగ్గరకురాలేదు. ఇంతలో, తమఆప్తమిత్రుడయిన కనపర్తి శ్రీరాములుగారు ఆ వీధినిరాగా వారిసహాయంతో ఆ పంచముని మోసుకొని తమ ఇంటిఅరుగుమీద పడుకోపెట్టింది. అతనికిశైత్యోపచారాలుచేసి, అన్నంపెట్టి రక్షించింది.

ఈలాంటిఉదాహరణలెన్నో ఉన్నాయి. వీరేశలింగంగారే తమస్వీయచరిత్రను తన అర్ధాంగిలక్ష్మికి అంకితంచేస్తూ ఈలావ్రాశారు.

"నాచేసినసమస్త సత్ప్రయత్నములలోను ఛాయవలెనాతోనుండి, నన్నుప్రోత్సాహపరచుచు, ధర్మ మార్గాను సరణమునందు నాతోగూడ, సకలకష్టములను సంతోషపూర్వకముగ సహించుచు సత్యమైన సహ ధర్మచారిణియయి, తల్లి బిడ్డలనువలె అవ్యాజానురాగములతోడ, సహస్రసమస్తములతో సదా నాకు సంరక్షణ చేయుచు, ఏబదిసంవత్సరములకాలము నా ప్రాణమునకు ప్రాణమైయుండిన నా అర్ధాంగలక్ష్మియైన రాజ్య లక్ష్మికి దీనిని నేనంకితము చేయుచున్నాడను."

—★—



# వజ్రాలును వజ్రాలతో పొదుగబడిన నగలును





స్వచ్ఛతయును, అందమైన నీలముతోకూడిన తెలుపు రంగును, అసాధారణమైన కాంతిమంతమును, ఎటువంటి దోషమున్నూలేని చెక్కడమును, పనితనమును, ఈలక్షణాలన్నీ కూడా మేము వాడే వజ్రాలలో చాలా ఎక్కువగా ఉన్నాయి. మొట్టమొదటనుంచీ ఎక్కువ నాణ్యమైన వస్తువులను న్యాయమైనటువంటిన్నీ ఎల్లప్పుడును తక్కువయైనటువంటిన్నీ ధరలకు ఈయగలుగుటకే మేము పాటుపడుచున్నాము. మాకిచ్చే ప్రతి ఆర్డరు విషయములోను, మేము స్వయముగా శ్రద్ధవహిస్తామని మీరు నమ్మవచ్చును. ఉత్తమమైన తీరును అందమైన పనితనమున్నూగల ఎన్నెన్నో వేర్వేరు రకాల నగలు మీరు ఎంచుకొని తీసుకొనడానికి మా వద్దదొరుకుతాయి.

*వుమ్మిడి*

## రామయ్య శెట్టి గురుస్వామి శెట్టి & కో.,

23/25, చైనా బజార్ రోడ్డు, మదరాసు.

DJK-95



# శ్రీ వీరేశలింగం శతవార్షిక దినోత్సవం

★

శ్రీ కె. కల్యాణస్వామిగారు బి. ఏ. బి. యల్.



వైజ్ఞానిక, సాంస్కృతిక, సాంఘిక, నైతికరంగాలలో ఆంధ్రదేశం, ఆంధ్రులు ఈనాడు మహోన్నతస్థితి నందుకొనడానికి ప్రధానంగా గాకపోయినప్పటికీ విశేషంగా శ్రీ రావు బహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారి జీవితము ఆయన కృషి కారణమని చెప్పవచ్చును.

ఆధునిక ఆంధ్రమహాపురుషులలో అగ్రస్థానంవహిస్తున్న శ్రీ పంతులుగారు 1919 లో బ్రహ్మ సాయుజ్యం పొందడానికిపూర్వం అర్ధశతాబ్దంపాటు వివిధరంగాలలో కొనసాగించిన కృషిఫలితంగా ఆంధ్రప్రజాహృదయంలో అద్వితీయ పరివర్తనవికాసాలు సంభవించినవి. ప్రతిభావంతము, సర్వతోముఖ విజ్ఞానవిలసితము అయిన ఆయనవ్యక్తిత్వవిశేషం పర్యవసానంగానే జాతిమతవివక్షతగాని, పేద సాదభేదంగాని స్త్రీపురుష విచక్షణగానిలేకుండా పెక్కురంగాలలో ఆంధ్రప్రజాజీవితం పునరుజ్జీవన వికాసాలనందింది.

ఆయన సంస్కరణలో విధ్వంసన, నిర్మాణంకూడా ఒకద్వానిని ఒకటి ఛాయవలె వెన్నంటుతూ వచ్చినవి. వ్యక్తులలోని అవినీతిని, సంస్థలలోని దుర్నీతిని వెల్లడించి, నిర్మూలించి, భస్మీపటలమొనరించి, అభిస్మంనుంచి సన్మార్గజీవనానికి ఆయనపునాదులునిర్మిస్తూవచ్చారు. ఎంతటి ఉన్నతపదవులలో నున్నవారి సైనాలక్ష్యపెట్టక వారికుళ్లును బయటపెట్టడం - కాలానుగతంగా సంఘంలో వేళ్లుపాతుకొనిపోయివున్న ఏ మూఢనమ్మకానో్న నిర్మూలించడం, అణగద్రొక్కబడి, క్రుంగి కృశించిపోతున్నవారిని సముద్ధరించడం- వీటికే శ్రీ వీరేశలింగంపంతులుగారు విధి విరామాలులేకుండా పాటుపడ్డారు.

తెలుగు సారస్వతరంగంలో ఆయన మహాపండితుడై విరాజల్లినాడు. ఆయనకలం అనేకరంగాలలో పరవళ్లుత్రొక్కింది. ఏవిషయాలలో ఆయన సంస్కరణలను ఆశించాడో, వాటిసఫలతకే తన గ్రంథరచనావ్యాసంగాన్ని ఆయనఅత్యంతమైన సమర్థతతో వినియోగించుకొంటూవచ్చాడు: అయన తన స్వయంకృషివల్లనే బహుసామాన్యమైన పరిస్థితులనుంచి పైకివచ్చారు.

శ్రీ వీరేశలింగంపంతులుగారు 1848. ఏప్రిల్ 16 వ తేది. ఆదివారంనాడు రాజమండ్రిలో జన్మించారు. ఆయనతలిదండ్రులు పేదవారు. పొందిన విద్యాపరిజ్ఞానం పరిమితం. ప్లీడర్‌గుమాస్తాగిరితో ఆయన తనజీవితరంగంలో అడుగుపెట్టాడు. తరువాత పల్లెటూరి బడిపంతులైనారు. చివరకు ప్రభుత్వ కళాశాలలో తెలుగు పండితునుగా స్థిరపడ్డారు.

సంఘంలోవ్యాపించివున్న మూఢవిశ్వాసాలపట్ల శ్రీ పంతులుగారికి ఆదినుంచీ తగనిద్వేషం. తనహృదయానికి ఏవి వినాశకరంగా, అన్యాయంగా, అమానుషంగాతోచినవో, ఆ అనర్థాలను సమూలంగా

నిర్మూలించడానికి ఆయన తనయావచ్ఛక్తినీ వినియోగించారు, ఎన్నోకష్టాలనూ, నిష్ఠూరాలను ఎదుర్కొన్నారు. బహిష్కారపు బెదిరింపులను - ఛీత్కారావమానాలను, తుదకు ప్రాణోపద్రవాన్నికూడా ఎదుర్కొనడానికిసిద్ధపడి తనలక్ష్యసంసిద్ధికై ఆయన వీరోచితంగా పోరాడినారు.

"వివేకవర్ధని" పేరున ఒకవారపత్రికనుస్థాపించి, అవినీతికి సంఘంలో దోహదమిచ్చినవ్యక్తులను, సంస్థలనుకూడ బయటపెడుతూ సంస్కరణకుకృషిచేశారు.

సంఘవ్యవస్థలోని కుళ్లునుతొలగించడానికి ఆయనచేసిన మహత్కార్యాలలో ముఖ్యంగా ఎన్నదగినది వితంతుపునర్వివాహం. దీనికై శ్రీపంతులుగారుచేసినకృషి, త్యాగం అనల్పం. అన్నిటికంటె బాలవితంతువుల దారుణహృదయవిదారక విలాపాలలోనే ఆయనహృదయం, అధికంగా వ్యథితమైపోయింది. ప్రతికూలపరిస్థితులలో ఆయనఒంటరిగా ఈవితంతుపునర్వివాహ సమస్యాపరిష్కారానికి అచంచలమైనదీక్షతో పూనుకొన్నాడు. ఎవరోకొలదిమంది సహచరుల ఆమోదాభిమానాలుతప్పితే అనేకులు ఈసంస్కరణలపట్ల ఆక్షేపణనుతెలియచేయడమేగాక వెలివేస్తామని బెదరించారు. చాటున మాటున అపనిందలను, వదంతులను కూడా వ్యాపింపచెయ్యడానికి కనుదీశారుకారు. మొదటివింతంతుపునర్వివాహంఊరేగింపు రాజమండ్రినగ వీధులలోజరిగినపుడు ప్రజాప్రాతికూల్యం కారణంగా సబ్‌కలెక్టరు, జిల్లాపోలీసు సూపరింటెండెంటు కూడావుండవలసివచ్చింది.

స్త్రీలలో విద్యావిజ్ఞానాలు పెంపొందడానికి, ఇంటబయట స్వాతంత్ర్యానికి నిరోధకరంగావుండే పెక్కుదురాచారాల నిర్మూలనకు ఆయన తనరచనలమూలంగానేమి, ఇతరమార్గాలలోనేమి స్తవనీయమైనకృషి చేశారు.

మహిళల దుస్థితిని తొలగించడానికై పంతులుగారుసాగించిన కార్యకలాపాలకు ఆయనసతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారు చేదోడువాదోడుగా నిలచి ప్రోత్సాహం ఒనగూర్చింది. అభాగినులైన యువతులయెడల ఆమె ఆదరాభిమానాలను వర్షించి తల్లికంటె మిన్నయై వెలుగొందింది.

శ్రీ పంతులుగారు ఆస్తికోన్నత పాఠశాలనుస్థాపించి, అందులో అసాధలైన యువతులకు, హరిజనులకు ఉచితవిద్యాదానానికి అవకాశంకలిగించారు. నిరాధారలు, అగతికలు అయిన వితంతుయువతులకోసం శరణాలయాన్ని ఏర్పాటుచేసి, అందులో వారివిద్యవిజ్ఞానవికాసానికి అనేకవిధానాలను ప్రవేశపెట్టారు పంతులుగారు. ఈసందర్భంలోచేసిన నిస్వార్థసేవఫలితంగానే నేడుదేశంలో ఎందరోఅభాగినులు వివాహితలై సుఖజీవనం నెరపుతున్నారు. బెంగాలుకు ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఎంతో, దక్షిణహిందూదేశానికి ఈయనఅంత. కొన్నివిషయాలలో శ్రీ విద్యాసాగర్‌కంటె పంతులుగారి కృషి హెచ్చు.

పంతులుగారు కార్యవాది. పూర్తిగానిరాడంబరజీవి. తోటిమానవుల అభ్యుదయమే ఆయన ఏకైకలక్ష్యం. ఈలక్ష్యసాఫల్యానికి ఆయన నిరంతరం నిష్కపటంగా కృషిచేస్తూ వచ్చారు.

పండితుడుగా ఆయనకులభించే వేతనం స్వల్పం. అయితే గ్రంథరచన ప్రచురణమూలంగా సుమారు పదివేలరూపాయల విలువగలఆస్తిని సంపాదించి, దీనిని తాను నెలకొల్పినపాఠశాల, పురమందిరం, ప్రార్థనసమాజం, విక్టోరియాశరణాలయాలపోషణకు వినియోగించడానికి ఒకసమాజాన్ని ఏర్పాటుచేశారు.

అదే హితకారిణిసమాజం. ఏకార్యాన్నైనా సాధించటానికి ఆధ్యాత్మికశక్తి ముఖ్యమని శ్రీపంతులుగారు ఏనాడో గ్రహించారు. ఆయనకు భగవంతునియెడలగల విశ్వాసంఅనంతం. దైవప్రేరేపణ ప్రోద్బలాలవల్లనే, తానుఏపనినైనా చెయ్యగలుగుతున్నానని ఆయనభావించేవారు. కనకనే ప్రార్థన సమాజాన్ని నెలకొల్పారు. అస్పృశ్యత, వర్ణవిభేదం, అర్థంలేనిమూఢాచారాలు, ఇంకాఎన్నోఅవాంతరాలు స్వార్థసంకుచిత దృక్పథపూరితులైన సనాతనులు కల్పించినవేఅని, వీటికి భగవంతునిపితృవాత్సల్యానికి, విశ్వమానవ సౌభ్రాతృత్వానికి, ఆధ్యాత్మికోపాసనకు సమన్వయమే కుదరడంలేదని శ్రీపంతులుగారు గ్రహించే తాను ఆశించిన సంఘసంస్కరణలకు మతంవిషయంలో విశాలమైన దృక్పథం అవసరమని నిశ్చయించుకొన్నారు.

అటువంటి విశాలదృక్పథం ప్రాతిపదికగాని ఈసంస్కరణలు కలకాలం నిలబడనేరవని ఆయన విశ్వసించారు, ఈవిశ్వాసంతోనే ఉదార మతసిద్ధాంతాలతో బ్రాహ్మమతాన్ని ఏర్పాటుచేశారు. తాను బ్రాహ్మ్మనని ప్రకటించుకొన్నారు.

జంధెమును విసర్జించారు. మతంవిధిస్తూవచ్చిన మూఢాచారసంప్రదాయాలకు స్వస్తివాచకం చదివారు. ఆధ్యాత్మిక సాంఘికరంగాలలో ఆయనగొనివచ్చిన అపూర్వసంస్కరణల పరిణామ ప్రభావాలు అనంతమనిచెప్పవచ్చు. ఆయనజీవితానికి ఈ సంస్కరణలే వెలుగురేఖలు. మానవసేవే మాధవ సేవఅని నిరూపించినవి ఈసంస్కరణలే.

సాంఘికంగా, మతవిషయకంగా, వైజ్ఞానికంగా ఆంధ్రులు నేడుపొందివున్న సర్వతోముఖ వికాసానికి పంతులుగారిజీవితం. కృషికూడా ప్రత్యక్షంగానో పరోక్షంగానో బాధ్యతవహించినవని చెప్పకతీరదు. ఆయనశతవార్షికదినోత్సవం 1948 ఏప్రిల్ 16 వ తేదిని ఆతర్వాత కొన్నిరోజులలో ఆంధ్రదేశంలో అనేకచోట్ల జరుగుచున్నది. 1919 మేనెల 27 వతేదిని శ్రీ పంతులుగారు బ్రహ్మసాయుజ్యంపొందారు. ఈవార్షికోత్సవాలను అత్యంత జయప్రదంగా నిర్వహించి, ఈ మహాపురుషుడు ఆంధ్రలోకానికిచేసిన అపారమైనసేవను సంస్మరించడం మనకు సముచితంమాత్రమేకాదు, విధ్యుక్తంకూడా.

క్రౌన్  బ్రాండ్


# అల్యూమినియం పాత్రలు

## పరిశుభ్రమయిన లోహముతో తయారైనవి.

- శ్రేష్ఠమయిన రకము
- అందమయిన ముగింపు
- సొంపైన ఘనితనము
- ఆరోగ్యప్రదమయిన సామగ్రి
- స్వల్పధర
- మన్నికలో మేలైన స్వచ్ఛత

లోన కళాయి, పైన తోముట, శ్రమ లేనియు లేవు.



మీకు కావలసిన విషయాలన్నిటికిని ఈ దిగువ తెలియజేసిన చోట అడగండి.

## జీవన్ లాల్ (1929) లిమిటెడ్

హెడ్డాఫీసు: కలకత్తా

మేనేజింగు డైరెక్టర్: **హిమచంద్ - కె. షా.**

కార్యాలయము: 127 మింట్‌స్ట్రీట్, మద్రాసు.

క్రౌన్‌మార్కు అల్యూమినియం, ఇత్తడి పాత్రలను తయారొనర్చువారు

బ్రాంచీలు: బొంబాయి - మద్రాసు - రంగూన్ - రాజమండ్రి - ఢిల్లీ & ఏడెన్.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎస్. కేసరి

## శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు

(0)

శ్రీ పంతులుగారు ఆంధ్రమహిళాలోకమునకు చేసిన మహోపకారమును వెల్లడి పరచుచు పలువురు వ్రాసిన వ్యాసములను ఈ మాసపు గృహలక్ష్మి పత్రికలో కానవగును. వీరి శతవార్షికజన్మదినోత్సవమున వీరిని స్మరించి నమస్కరించి నాకు వీరుచూపిన పరమోత్కృష్ట సంఘసేవామార్గమున నేనుచేయదగిన స్వల్పవిషయములను, నా అనుభవములను వ్రాయుచున్నాను.

నేనుమద్రాసునకు వచ్చిన కొంతకాలమునకు పంతులుగారు ప్రెసిడేన్సీకళాశాలకు ఆంధ్రపండితులుగా వచ్చిరి. 1904 లో కాబోలు వారాపదవినుండి విరమించిరి. ఆ మధ్య కాలమున అప్పుడప్పుడు వారిని దర్శించుట తటస్థించుచుండెను. తలపాగా, చాదు బొట్టు, తెల్లనిమీసములు గల అప్పటివారిముఖవిలాసము ఇంకనునాకు మరుపు రాలేదు. పిమ్మట వారప్పుడుచేయుచుండిన స్త్రీ జనోద్ధరణ, సంఘసేవలగూర్చి తరుచుగ వినుచుంటిని. ఆ కాలమున వారువ్రాసిన గ్రంథరాజములను నేనుచదువుచుంటిని. ఆంధ్రదేశమున స్త్రీ పురుషులు వీరినవలలను, ప్రహసనములను, నాటకములను విడువక చదువుచుండిరి. విద్యాలయములలోకూడ వీటినిపాఠ్యగ్రంథములుగ నిర్ణయించియుండిరి. ఈ కారణములచే స్త్రీలలో మంచి సారస్వత చలనము కలిగినది. అప్పటినుండియే మనప్రాంతమున స్త్రీ విద్యాభివృద్ధికి ప్రారంభమని చెప్పవచ్చును.

ఈ కాలమున పెండ్లిండ్లలో వధూవరులకు క్షౌరపుసామానులును, తోలుసంచులను చదివించుట పరిపాటియైనది. వీరేశలింగంగారికి పూర్వము విలువగలవస్త్రములు, ఆభరణములు కట్నములుగ చదివించుట ఆచారము. శ్రీవీరేశలింగంగారు నాటిప్రజలలో కలిగించిన విజ్ఞానప్రబోధముయొక్క ఫలితముగా పలువురు వీరిగ్రంథరాజములనే కట్నములుగా వధూవరులకు చదివించుచుండిరి. ఇందుకనుకూలముగా శ్రీ పంతులుగారు తమగ్రంథముల

నన్నింటిని 10 వాల్యూములుగా నచ్చొత్తించి రు 15 లకు విక్రయించెడివారు. నేనుకూడ నా స్నేహితుల వివాహములందు ఈ గ్రంధములనే చదివించుచుంటిని.

వీరు ఆంధ్రదేశమున సంఘసంస్కరణ కార్యక్రమమును తలపెట్టినప్పుడు బాల వితంతువులు మెండుగనుండిరి. ఒక సం॥ వయసుగల ఆడపిల్లలకుకూడ వివాహముచేయు చుండిరి. ఇందువలన బాలవితంతువులసంఖ్య దినదినాభివృద్ధి చెందుచుండెను. అప్పుడు ఈ అనాధలకు ఆలనపాలన లేకుండెను. చిన్నబిడ్డలను పెద్దలకు విక్రయించి తలిదండ్రాదులు ధనమునుగడించుచుండిరి. ఇట్టివిషమస్థితిలో దైవము వీరేశలింగముగారి హృదయమున ప్రవేశించి స్త్రీ దౌర్భాగ్యమును రూపుమాప ఆయనను ప్రేరేపించెను. ప్రారంభమున వీరు కొన్నికష్టములకు గురిఅయినను క్రమముగ వీరిసంకల్పము సిద్ధించెను. ఆ కాలమున పునర్వివాహమును చేసుకున్నవారింట ఒకంచినీళ్లుత్రాగినను వెలివేయుచుండిరి. వారింటికి బంధుమిత్రాదులుగూడపోకుండ కట్టుబాటుగనుండెడిది. ఆ దంపతులను అంటరానివారిగ సంఘముచూచుచుండెను. ఇప్పుడట్టి ఆంక్షలుపోయి సంఘమున మిగతఅందరివలెనే వీరును ఆదరింపబడుచున్నారు. ఇప్పుడు పునర్వివాహము చేసుకున్న ఆమె మొదటిభర్తతద్దినము నాడు మంచిదక్షిణకై-కొమ్ములుదిరిగిన వైదికశిఖామణులుకూడ నిమంత్రణకు కూర్చొను చున్నారు. ఇట్టిదంపతులనేకులు పెద్దకుటుంబీకులై ఆ మహానుభావునిస్మరించుకొనుచు సుఖముగనున్నారు. ఈ కాలమున పునర్వివాహములు పరిపాటియై ప్రతినిత్యము జరుగుచునేయున్నవి.

ఈ విషయమై నేచేయగలిగినసేవః—

## శ్రీ కొ తా శ్రీ రా మ శా స్త్రి గా రు

వీరు బందరుకాపురస్థులు వితంతువివాహమాడినవారు. "శారద" యను సచిత్ర మాసపత్రికను 1923 లో స్థాపించి కొంతకాలము నడిపియుండిరి. వీరువందేమాతరోద్యమములోను, బ్రహ్మసమాజప్రచారమునను, పనిచేసియుండిరి. కొంతకాలము బందరు జాతీయకళాశాలయందు ఉపాధ్యాయులుగకూడఉండిరి. తెనుగున చాకచక్యముగ సంభాషించగలసమర్థుడు. చక్కనిరవాతగాడు. బంగాళీభాషనుండి భక్తియోగము పూర్ణయోగము మున్నగుగ్రంథములు కొన్నితర్జుమాచేసియున్నారు. వీరు శారదపత్రికను ఉచ్ఛస్థితిలో నడుపయత్నించి, చాలనష్టపడి బందరువిడిచి మద్రాసుచేరిరి. వీరువితంతువివాహమాడి నందున ఈ ఊరిలో బ్రాహ్మణులయిండ్లలో కాపురమునకు స్థలముదొరుకుట కష్టముగ నుండెను. అప్పుడునేను వీర్లనుచేరదీసి వారికినాయింటనేస్థలమిచ్చి గృహలక్ష్మిపత్రిక

కార్యాలయమున ఉద్యోగమిచ్చి ఆదరించితిని. వీరి ఇరువురుఆడబిడ్డలను అడయారుదివ్యజ్ఞాన సమాజమున చేర్పించి చదివింపించితిని. ఇప్పుడీబిడ్డ లిరువురిలో ఒకరు ఎం ఏ. యల్. టి. ఈమె ఉద్యోగముచేయుచు ఉండి వివాహమొనర్చుకొని ప్రస్తుతం బందరులో భర్తతో కాపురముచేయుచున్నది. ఆదంపతులకొకమగబిడ్డ. రెండవ ఆమె మద్రాసు యూనివర్శిటీ లోనే యం.ఏ. పరీక్షనిచ్చి - చారిత్రకపరిశోధనగావించి వరుసగా యం. లిట్.; డి. లిట్ డిగ్రీలపొంది విశ్వవిద్యాలయమున ఉన్నతోద్యోగమున కర్హతసంపాదించియున్నది. ఈమె తరువాత బాలికయు బి. యస్. సి. పరీక్షనిచ్చి విద్యాశాఖయం దుద్యోగమొనర్చుచు గత సం॥న బళ్లారిలోస్వర్గస్థురాలైనది. వీరి మగసంతానమును ప్రసిద్ధివహించినవారే. పెద్దవారగు రామమోహన్, ఆనందమోహన్‌గార్లు పేరుపడసిన చిత్రలేఖనా నిపుణులు; ఖండాంతరము లందును ప్రఖ్యాతిగడించిరి. వీరిలో ఆనందమోహన్‌గారు కాలగతినందిరి. మూడవవాడగు కృష్ణమోహన్ ఇటీవలనే ఎం.ఏ డిగ్రీపొందినాడు. శ్రీరామశాస్త్రిగారిటీవలనేగతించిరి.



ఈ కుటుంబచరిత్ర నరయుచో ప్రోడుతైపోయిన అభాగినుల జీవితవృక్షములు. తిరిగిచిగిర్చి, పూలతోకాయలతో విరాజిల్లజేసిన పంతులుగారికృషివిశేషము తెలియగలదు.

మరియొకరు:—

## పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు

ఈ శాస్త్రిగారుకూడ వితంతువివాహమాడినవారే. వీరును బిడ్డలతోకు [illegible] మద్రాసుకువచ్చి కష్టపడుచుండిరి. వీరి ఇద్దరిఆడబిడ్డలు సంగీతమునపరిచయముగల్గినవారు. కుమారుడు చిన్నకుమార్తె వేణుగానమును, పెద్దకుమార్తె, ఫిడియల్, గాత్రమును సాధనమొనర్చియున్నారు. వీరందరికి నాయింటనే వసతినిచ్చి గృహలక్ష్మిఆఫీసులో శాస్త్రిగారికి కొలువిచ్చి కాపాడితిని. వీరిబిడ్డలందరిప్పుడు మంచిస్థితిలో మద్రాసులోనేయున్నారు. ఈ శాస్త్రిగారుకూడ ఇటీవలనే చనిపోయినారు.

## మహాలక్ష్మమ్మ

ఈ మహాలక్ష్మమ్మ వితంతువై తిరిగివివాహమాడినది. పాపము రెండవభర్తనుకూడ పోగొట్టుకొని నర్సుపనిని నేర్చుకొని మావద్దకొలువునకు కుదిరినది. ఈమె మంచిభాషాజ్ఞానముగల తెలుగుతల్లి. నేర్పుగవ్రాయగలిగినముసద్దీ. వయసుచెల్లిన వితంతువైనను శిరోజములను చక్కగపోషించుకొనుచుండెను. పట్టుచీరెలను కట్టుకొనుచుండెను. నగలను ధరించుకొనుచుండెను. నవ్వుతూమాటలాడుచుండెను. ఈ కారణములనుబట్టి మాయింటి ఆబిడకు ఈమెనుచూచిన సరిపడకుండెను. ఈమెయెదురుగవచ్చిన ప్రక్కకుతొలగి నసపెట్టుచుండెను. ఈమెకు మా బంతిభోజనమునకును అర్హత లేకుండెను. కడపట ఈమెకు మాయింట మంచినీరు దొరుకుట కూడ దుర్లభమాయెను. "నీవురామేశ్వరముపోయి తలబోడి చేసుకరమ్మ"ని పలుమారామెను మా ఆబిడ బాధించుచుండెను. అయితే మా పిచ్చియిల్లాలినిచూచి ఆమె పకపకనవ్వుచు సమాధాన పరచుచుండెడిది. నాకు నా ఇల్లాలిని తలచినప్పుడెల్లను వీరేశలింగముగారు వ్రాసిన "ఆచారపు అన్నమ్మ, చాదస్తపు చలమమ్మ" ప్రహసనములు జ్ఞప్తికి వచ్చుచుండును.

పైమూటిని మచ్చుకు యిక్కడవ్రాసితినిగాని మరియెన్నియో జరిగినవి. మానవసేవలోని చిక్కులు అనువ్యాసమును మరుమాసములోవ్రాసి ప్రకటించెదను.

శ్రీ పంతులుగారు వృద్ధాప్యమున వ్యాజ్యములలో చిక్కుబడుట అందరికి తెలిసినవిషయము. ఈవిషయమై శ్రీపంతులుగారి ప్రియశిష్యులలో నొక్కరగు శ్రీరాయసం వెంకటశివుడుగారు తాము వ్రాసిన "శ్రీ వీరేశలింగసంస్మృతి"లో చక్కగ వివరించిరి.

శ్రీ పంతులవారి భార్యావియోగానంతరము వారిని పరామర్శింప వెళ్లి, వెంకటశివుడుగారును మరియొక మిత్రులును వారికి భవిష్యత్తునుగూర్చి గావించిన విన్నపమును, దానికి పంతులుగారి ప్రత్యుత్తరమును గమనింపుడు:—

"సాయంకాలము సెలవుఁదీసికొను సమయమున, పంతులుగారికి మే మొకచిన్నవిన్నపము చేసితిమి. శక్తివంచనలేక జీవితకాలమంతయు వారు స్త్రీలోకమున కపారసేవఁజేసిరి. దైవవైపరీత్యమున నీనాఁటికి వారి కాశ్రమ పరివర్తనము కలిగినది. వారీవితంతుశరణాలయకార్యభార మిఁక గృహస్థాశ్రమమునుండు ఏమిత్రుని నొద్దనైన నిలిపి, తమ స్వాంతమును ప్రశాంతమగు పరమేశ్వరధ్యాన నిమగ్నము చేయుట శ్రేయముకదా! ఇట్లు చేయుటచే, తమరు ఉద్యమమును విరమించి పలాయితులైరని భావించెడి యల్పమతులుండరనుట స్పష్టము!

మామాట లూఁకొట్టుచుండు పంతులు మెత్తపడుచుండెనని మే మాశించితిమి. కాని, వారు ఉద్రిక్తచేతస్కులై యిట్లుపల్కిరి:—"మిత్రులారా. మీకిదే స్పష్టముగఁ జెప్పుచున్నాను. నాశరీరములో నించుక శక్తిసామర్థ్యములున్నను, నా దేహమున కొనయూపిరియును నిలుచు నిమేషమువఱకును, నాప్రియతమోద్యమమగు వితంతూద్ధరణకార్యమును నేను సాగించుచునేయుండ నిశ్చయించుకొన్నాఁడను! నేనునడుపుచుండెడి యీస్త్రీశరణాలయమునుగూర్చి లోకమందఱునుగూడ నామీఁద నిందలు నపవాదములును వేసి, నన్నుబాధించి, వేధించి, బహిష్కరించినను, దీనియందొక యనాథబాలికయైన నిలిచి యుండువఱకును, నేను దీనిని విడనాడనొల్లను! ఇదియే ముమ్మాటికి నానిశ్చితాభిప్రాయము.!"

పిదప కొంతకాలమునకు శ్రీ పంతులుగారిపై వ్యాజ్యములు నడుచుచున్నపుడు- కలకత్తాలో ఎం. ఏ కు చదువుచుండిన వెంకటశివుడుగారివల్ల వివరములుతెలిసి కీ॥ శే॥ శశిపాదబెనర్జీగారిట్లనిరట:—

"నాకు దీనిరహస్యమిపుడు స్పష్టమైనది! పత్నీవియోగము సంభవించిన పంతులుగారియాశ్రమమునగూడ స్త్రీల సంస్థకుఁ బాటుపడుచుండుట, శరణాలయమునందలి యువతులు వారికి భోజనసౌకర్యములు గలిగించుచుండుట,—ఇవియె గుణగరిష్ఠులగు మహాపురుషుల మీఁదనైన నెన్నినిందలో పడుటకుచాలును!"

పిదప శ్రీ వెంకటశివుడుగారు శ్రీ బెనర్జీగారిజీవితమందలి ఇందుకు సంబంధించిన విశేషముల నిట్లు వ్రాసియున్నారు:—

ఆయన పెద్దకుటుంబీకుఁడు; కలకత్తాలో వితంతుశరణాలయము నొకటి చిరకాలము జయప్రదముగ జరిపిరి. ఉచ్ఛదశయందే యొకపుడాసంస్థ విరమింపఁబడుటకుఁ గారణము, వారియింటఁగలిగినయొక విపత్తే. వారికి భార్యావియోగమొ, పుత్రికావియోగమొ తటస్థించిన దినముననే, "వితంతుశరణాలయము" మూసివేయఁబడెను! ఇంట నుండెడి తన యొక్క కూఁతురును మరణమునొందినదినముననే, పరిచారికల నందఱిని పూనిపించి, మగనౌకరుల నాయన యేర్పఱచుకొనెను! "వచ్చిననిందను బాపుకొనుటకు విశ్వప్రయత్నములు చేయుటకంటె, నిందలకు మొదలెడ మీయక వర్తించుటయె మేలుకదా! సంఘసంస్కర్త దూషణభూషణముల కతీతుఁడుగ నుండవలసినమాట వాస్తవమే. కాని, జనుల కాతనితో నభిప్రాయభేదములుండిన నుండవచ్చునుగాని, అతని నిర్మలప్రవర్తననుగుఱించి మాత్రము సంశయలేశము నుండఁగూడదు! ఎన్నఁడును జనుల కట్టి సందియములు జనింపకుండునట్టుగ నెంతో మెలఁకువతో నాతఁడు మెలఁగవలయును!" అని బెనర్జీగారు పలికిరి.

---

ఫిబ్రవరి సంచికయందు

"నా చిన్ననాటిముచ్చట్లు"లో ప్రస్తావించబడిన

## బంధు బలగము - కట్టడముల ఛాయాచిత్రములు



నేను నా మొదటి భార్య కనకమ్మ:



శేషగిరి - భార్య వరలక్ష్మి



శేషగిరి బిడ్డలు - రాధ - రమణ - శీత



చిన్నప[illegible] శారద



మధుమాధవి - మనుమరాలు



చిన్ననాటి వసంతకుమారి (రెండవకుమార్తె)



రాధాకృష్ణుడు - వసంతకుమారి - బాలకేసరి
(మనుమలు - కుమార్తె)



కే. జి. మీనన్ ఐ. సి. యస్. సతీసమేతం



చిన్ననాటి శారద



శారద - మాధవి - కాత్యాయిని - అల్లుడు - నాచేతులో వసంతకుమారి

(కుటుంబము)



కుమారమీనన్ - భార్య (Military Medical Service)



భాస్కరమీనన్ (Asst. Profr. Presidency College)



కే. జానకమ్మ, బి. ఏ.
(Music Professor Govt. Trg. College, Trichur)



కృష్ణమీనన్, బి. ఏ., బి. ఎల్.,
మధుర దేవాలయ మేనేజరు వారి భార్య



కేసరికుటీరం - తిరుచూరు



కేసరికుటీరమున మందులను చేయువారు - తిరుచూరు



వనమూలికలను సేకరించు అడవి - తిరుచూరు



లోధ్రను తయారు చేయుటకు కావలసిన ఓషధులు దొరుకు అడవి - తిరుచూరు



తిరుచూారు భవనం - ముందుదృశ్యం

తిరుమూారు భవనం - వెనుకదృశ్యం



తిరుచూరులో ఏటేటా జరుగు "పూరం" ఉత్సవం _ 12 ఏనుగులు పైభాగమున బారుతీరి నడుచుచున్నవి

# స్త్రీలు—వీరేశలింగం పంతులుగారు

శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు

ప్రతిదేశంలోను సంస్కరణప్రియులు జన్మిస్తూఉంటారు. మనఆంధ్రదేశంలోకూడా కొంతమంది జన్మించారు. ఒక్కొక్కరు ఒక్కొక్కవిషయమై సంస్కరణకోసం పాటుపడ్డారు. స్త్రీలసంస్కరణ విషయమై ఎక్కువగాకృషిచేసి, స్త్రీలఅభ్యుదయానికి దోహదమిచ్చినవారు మనపంతులుగారు. మాతృస్వరూపిణి అయినస్త్రీకి విద్యలేకపోతే దేశంలోఉండే అనర్థకాలు కలకాలం ఉండిపోతాయి, దేశంఔన్నత్యానికిరావాలంటే స్త్రీకివిద్యముఖ్యం, అనేఆశయంతోనే పంతులుగారు స్త్రీఅభ్యుదయానికి వారిజీవితసమర్పించారు.

పూర్వాచారంఅనేపేరున బాల్యవివాహాలుఆంధ్రదేశంలో విరివిగాజరుగుతూవుండేవి. రజస్వలానంతర వివాహాలు చేసినవారిని వెలివేసేదిసంఘం. అందువల్లదేశంలో బాల్యవితంతువులు ఎక్కువగావుండేవారు. విద్యలేని యీబాలవితంతువుల జీవితంచాలా దుర్భరంగాఉండేది. పెళ్లిఅంటేఏమిటో భర్తఅంటేఏమిటో తెలియనిబాలవితంతువుల జీవితంకష్టమయినదనిన్నీ, ప్రకృతికివిరుద్ధమయినదనిన్నీ శాస్త్రసమ్మతంకాదనిన్నీ పట్టుపట్టి ఎదిరించి వితంతుశరణాలయములులేవదీసి స్త్రీపునర్వివాహాలు ప్రోత్సహించి అభాగ్యలయినస్త్రీలకు త్రోవచూపించినారు పంతులుగారు. అంతవరకూ మూఢాచారంగావున్న ఒకానొక ఆచారాన్నిధిక్కరించి సంఘాన్నిసంస్కరించడం చాలాకష్టం. ఎన్నిఅడ్డంకుల్నిఅయినా ఎదుర్కొనవలసివుంటుంది. ఎన్నికష్టనిష్ఠూరాలకయినా గురికావలసిఉంటుంది. అటువంటివాటినన్నింటినీఓర్చిన మహావ్యక్తిమనపంతులుగారు. మహాత్ముడు రాజకీయంగా ప్రజల్లో చైతన్యం కల్గించినట్లుగా పంతులుగారు సాంఘికంగా ప్రజల్లోచైతన్యం కల్గించారు.

సాంఘికవిషయాల్లో ఈయనసాధించని సంస్కరణములేదు. జాతిమతభేదములను పాటించనిమహావ్యక్తి కేశబ్‌చెంద్‌సేన్‌మొదలగువారు వ్యాప్తిలోనికితెచ్చిన బ్రహ్మమతము వీరిమతము. విగ్రహారాధనఅంటే పంతులుగార్కి యిష్టముండేదికాదు. ఒకసారివారి సతీమణి రాజ్యలక్ష్మమ్మగారు బెజవాడలో ఒకరింట పంతులుగారితోకూడ బసచేశారు. ఆమె కనకదుర్గను దర్శించాలని కోరికవుండి పంతులుగార్ని అడిగితే కోపగించుకుంటారని అయింటావిను అడగమన్నారు. పంతులుగార్ని ఆయింటావిడఅడగగా యింట్లోవున్న నేన్నికల్లుచూపించమన్నారట పంతులుగారు. వీరి అభిమానసంస్కరణము వితంతువివాహము, వారిజీవితాంతమువరకు ఆ ఉద్యమము కార్యరూపందాల్చాలనే ఉద్దేశంతోవారు కాయకష్టలాపనిచేశారు. వితంతువులను వివాహముచేసుకొనుటకు సాహసించేయువకులు చాలాతక్కువగాఉండిరి. కనుకమొదట్లో వధూవరుల గుణశీలములు, కుటుంబసాంప్రదాయము మొదలయిన విషయములను ముఖ్యంగాచూడక వివాహముల సంఖ్యకోసమే చూచేవారు. అందువల్ల కొంతవిమర్శనకు గురిఅయినారు. కాని విధవావివాహం, సంఘాచారమునకు విరుద్ధంకాకుండా మొదటఏర్పడినతర్వాత అటువంటివిషయములను వధూవరులే చూచుకుంటారనే వారిఉద్దేశం.

అనాథబాలలు వారికి వ్రాసినఉత్తరములు వారు చదివి వినిపిస్తే జాలిపడని వారుండేవారుకారు. వివాహాపేక్ష ఉండినబాలవితంతువులు తల్లిదండ్రులనువిడిచి రహస్యముగా పంతులుగారి శరణుజొచ్చేవారు. కొంతమంది విద్యార్థులు యింకా ఇతరులు వారికిచాలాతోడ్పడేవారు. పెండ్లిచేసుకోవాలనే

కోరికగల బాలవితంతువులను రహస్యంగా పంతులుగారి వద్దకు పంపిస్తూ వుండేవారు. పంతులుగారు అన్నివిధములా సంఘానికి ఎదురీది, వారి అభిమానసంస్కరణమునకు వారిజీవితాంతమువరకూ నిశ్చితాభిప్రాయముతో పనిచేశారు.

పంతులుగారు సహజంగా కోపస్వభావులు. భర్తయొక్క కోపాన్ని, తొందరపాటును సర్దుతూ, అనుగుణ్యంగా ప్రవర్తించేవారు వారిసతీమణి, రాజ్యలక్ష్మమ్మగారు. భర్తకుయిష్టమయిన భోజనసౌకర్యాలు చూస్తూ పంతులుగార్కి కోపంరాకుండాచూడాలని ఆమె ప్రవర్తిస్తూ ఉండేవారు.

ఎంతచేసినప్పటికీ పంతులుగారి ఆగ్రహానికి గురికాకతప్పేవారుకారు. కాని ఆమెశాంతంగా పంతులుగారికి జవాబుచెప్తూ యుక్తిగామెలిగేవారు. ఆమెఎక్కువగా విద్యనభ్యసించకపోయినా పద్యములు, కీర్తనలు రచించగల్గిన విద్యావంతురాలు; భర్తయొక్క ఉద్యమములకు తోడుగాఉండి, అనాధశరణాలయములోవున్న బాలికలకు కన్నతల్లివలె ఉండేవారు. అటువంటిఆమె పంతులుగారినివిడచి 1910 సం॥ లో స్వర్గస్థురాలైనారు. ఆమె చనిపోయినరోజునుండి పంతులుగారుకష్టములకు, అపనిందలకు అపోహాలకు గురిఅయినారు.

అనాధశరణాలయంలోఉండిన యువతులు పంతులుగారితో కష్టసుఖములను, చెప్పుకోవలసివచ్చేది. పంతులగారి భోజనసౌకర్యములును ఆయువతులే చూడవలసివచ్చేది. ఈ అవకాశమునుతీసుకుని వీరిప్రతిపక్షులు నీలాపనిందలుమోపేరు. గానికాలంతోకూడా ఆ అపోహలు అంతరించిపోయాయి.

వీరి సంఘసంస్కరణోద్యమమునకు, వీరి రచనాకౌశల్యము తోడయి, వీరికి శీఘ్రముగా విజయమును చేకూర్చినది.

ఈనాడు యింతమంది ఆంధ్రవనితలు విద్యావంతులై, సంఘంలో పురుషులతోసమానంగా అన్నిరంగములలో పనిచేయగల సమర్థత గలిగియున్నారంటే వందసంవత్సరములక్రింద జన్మించిన ఆ సంఘసంస్కర్తయొక్క కృషిఫలమే.

# ఉగాది శుభసందేశం

మా ఖాతాదారులకు, స్నేహితులకు, శ్రేయోభిలాషులకు




ఈ నూతనసంవత్సరము ఆరోగ్యైశ్వర్యాభివృద్ధి నొసంగుగాత.

## ది మైసూరు ప్రిమియర్ మెటల్ ఫ్యాక్టరి



| ఆఫీసు | టెలిగ్రాము | కర్మాగారము, పనులు |
|---|---|---|
| ఫోను. 2535 | SUNBRAND | ఫోను 3177 |



## ది హిందూస్థాన్ మెటల్ రిఫైనరి అండ్ రోలింగు మిల్సు.

"Telegrams" "ROLLING MILLS"

ఆఫీసు — ఫోను. 2999




కర్మాగారము, పనులు. — ఫోను. 3177

మేనేజింగు పార్ట్నర్సు

## కేశవలాల్. కె. షా.

ఆఫీసు. 124, మింటుస్ట్రీటు, జి. టి., మద్రాసు.

కార్యాలయము. తండియార్పేట.

# పంతులుగారి స్మృతి

## శ్రీమతి పెద్దాడ వెంకటసుబ్బమ్మగారు



శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులవారిని వారి ఉద్యమమును సర్వసామాన్యముగా ఎరుంగనివారెవ్వరు ఉండరని నానమ్మకం. వీరుతలచుకొన్న కార్యమును పట్టుదలతో ఎన్ని ఆటంకములువచ్చినను కార్యదీక్షముఖ్య ప్రాధాన్యముగాతీసుకొని సాధించి ఆపనినెరవేర్చెడివారు. ముందు సనాతన హిందూధర్మశాస్త్రమునుబట్టి ఉపనిషత్ సారాంశమునుసరించి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని భగవంతుడొక్కడే-యని ఆరూఢ మనస్కులైరి. నా చిన్నతనంలో, 10, 11 ఏండ్లబాలికనైయున్నప్పుడు—నాకు

"విగ్రహముల పూజవిడచివైచి నిన్నుమానసంబున
ఈప్సితార్థ మిడుదు యందుకొమ్ము"

అని శ్రీప్రార్థనమందిరమున, ముందుగా చాలచరణములతో ఈమానసపూజనేర్పెడివారు. "ఆనందో బ్రహ్మ" అన్నట్లు శృతిప్రామాణ్యంగా బాలవితంతువుల కన్నీటినితుడిచివైచి ఎన్నోకష్టములు నిగ్రహించి కళ్యాణప్రదముగా కళ్యాణములుగావించి, వారిని పతివ్రతాశిరోమణులుగా, ఉత్తమగృహిణులుగాచేసి బహువంశాభివృద్ధిగావించిన పుణ్యమూర్తి. కుడిచేతికెడమచేయి తోడు అన్నట్లు - "పత్నీహితసూచిక" "సతీహితబోధిని" అని సులభశైలిని స్త్రీల కుపయుక్తమగు పుస్తకములరచించినారు. సంసారయాత్రారథమునకు స్త్రీ పురుషులచక్రములు న్యాయసత్యదయాశౌచములనెడి ఆకులుకల్గి రథగమనమునకెట్లు తోడ్పడనగునో ఆయనచక్కగ బోధించెడివారు. తామొనర్చిన వితంతువివాహముల పెండ్లికూతురినిచూడవచ్చిన వారికి పెండ్లికూతురు లోపాలోపములు దాచకచెప్పి-నీయిష్టమైననే చేసుకొమ్మని కాగలవరుని హెచ్చరించే వారు. ఆలోచించి ఇష్టపూర్తిగాచేసుకొన్నతర్వాత కష్టపెట్టరాదని ఖండితముగాచెప్పేవారు.

## రాజ్యలక్ష్మమ్మగారు

పురుషునికీర్తికి అపకీర్తికి అతనిగృహిణియే మూలము. శ్రీ రాజ్యలక్ష్మమ్మ పరమపతివ్రతాశిరోమణి. అందుకు నిదర్శనంగా శ్రీ వీరేశలింగంగారు-"నాభార్యమూలంచే యింతపెద్దపని చేయగలిగితిని" అని తమ స్వీయచరిత్రలోనుడివియుండిరి. ఆరోజులలో నిట్టివారికి సంఘంలోవెలి, దానివల్ల దాసినిరానిచ్చేవారుకారు; వంటవారునుఅంతే. కడకుదాహనమునకై గోదావరినీళ్లు కూలికి పోయువారుకూడా రాగలిగేవారుకారు. అందుచేతఆమెయేకష్టపడి గోదావరినీళ్లు తెచ్చుకొనేది. సాలుపొడుగున అవసరమునకుకావలసిన చింతకాయ పచ్చడి, ఉసిరికాయపచ్చడి, ఊరగాయలు, లొక్కుడుపచ్చళ్లు వగైరాస్వయముగ తయారుచేసిపెట్టుకొనేది. ఇంట్లోరెండుపూటలవంటఆమెయే. భర్తశిష్యులు రహస్యముగాపిలుచుకొనివచ్చిన బాలవితంతువులకు రాగానే గాజులతొడిగించడం, తలదువ్వి జడవేసిబొట్టు కాటుకపెట్టి అలంకరించడం వగైరాఆమేచేసెది. తనకడుపున పుట్టినబిడ్డలకన్నా ఎక్కువగావారిని ఆదరించేది. మధ్యాహ్నము రెండుగంటలగుసరికి ప్రాలుమాలక శ్రీపంతుల వారువ్రాసిన గ్రంథములనుచదివి వారికిబోధించుచుండెడిది. తలనిండాపువ్వులు, ముక్కునత్తు, మొగమున అర్ధచంద్రాకారముగబొట్టుకల్గి గృహలక్ష్మియై తంబురమీటుచు భర్తకు ప్రీతికరమగు భగవత్కీర్తనలను పాడుచుండెడిది. ఆమెస్త్రీవిద్యాభివృద్ధికై స్త్రీప్రార్థనసమాజమును, స్త్రీలకు పుస్తకభాండాగారమును

స్థాపించినది. పలకలు తెప్పించి ఉచితముగానిచ్చి అక్షరజ్ఞానములేని స్త్రీలకెందరికో అక్షరజ్ఞానము కల్గించి పుస్తకములు చదువగలవారినిచేసినది. మెరకవీధి తెలగా స్త్రీలు పురుషులకంట పడజాలమి ఇల్లువిడిచిరాకపోగా ఆవీధిననే జనానాస్కూలు పెట్టి శ్రీ రాజ్యలక్ష్మమ్మగారు, రామరాజు సుందరమ్మగారు, కొటికలపూడి సీతమ్మగార్ల సహాయముతో, వారికిచదువు నేర్పినారు. శ్రీ పంతులవారి శిష్యులు ఎంత సనాతనకుటుంబములలోవారైనను వారుచేయుపనులు మంచివిగావున తమ ఆడువారిని నిరభ్యంతరముగ శ్రీ రాజ్యలక్ష్మమ్మగారివద్ద కంపెడినారు.

శ్రీ పంతులుగారు, దుఃఖించుచున్న పెళ్లికొడుకులను పెళ్లికూతుళ్లను తీసికొనివచ్చుట, భోగముమేళములలో పరస్త్రీలనుచూడరాదని బ్యాండువాయిద్యములే ప్రోత్సహించుట, విద్యరానివారికి రాత్రి పాఠశాలలు వగైరా పెట్టి విద్యనేర్పుట, తలిదండ్రులులేని పంచమబాలబాలికలకు వసతిగృహమేర్పరచుట, అనాధప్రేతసంస్కారము, ధనవ్యయంలేకుండా ఉచితంగా శవములమోసి దహనమొనర్చుట,-ఇట్టిపలువిధములైనపనులుగావింప శిష్యులకు పురమాయింపగ వారునిశ్చింతగచేసెడివారు. పంచమునొకని తమాషాగా పెండ్లికొడుకునిచేసి, నలుగురుచేరి క్రొత్తబట్టలుకట్టబెట్టి ఆనందించవలెనంటే వారెప్పుడూతయారు. వనభోజనములకువారుసిద్ధం. వారుతమతమయిండ్లలో క్రొత్తకాపురపు పడుచుభార్యలచే పిండివంటలుచేయించుకొని పంతులవారికోర్కెపై వారితోకూడ నావపైకారులువెళ్లి నదీమధ్యమున ఇసుకతిప్పలపైచేరి ఆరగించి సంస్కరణ కార్యక్రమముల చర్చించువారు. అవికేవలముమాటలుకావు; కార్యములుజరుపుటే, శ్రీ రాజారామమోహనరాయలవారు సహగమనమునుమాన్పించిరి. అయితేవారట్లు వితంతువులై వట్టిమోడులవలెనున్న శోభ ఏమున్నది? పువ్వుపూచికాయకాచి పండుపండినకదా అందము. కావున శ్రీ పంతులుగారు వితంతూద్వాహములనుగావించినారు. పంతులుగారు తమభార్యకు పుష్పములన్న ప్రీతిగదాయని వారు గతించినపిదప వారితోటలో నొకభాగమునకు ప్రత్యేకముగ రాజ్యలక్ష్మి ప్రమదావనముఅని పేరుపెట్టిరి. అందుఇండియాలో లేని పుష్పజాతులుకూడా కొన్ని తెప్పించి వేయించి పెంచినారు.

నేడుస్త్రీలు విద్యాధికురాండ్రై కాన్ఫరెన్సులు నడుపుచున్నారు; నిరాటంకముగా తలఎత్తుకొని తిరుగుచు బ్రతుకకలుగుచున్నారు. దీనంతటికి వారియొక్క ఆశయములు ఆశీర్వాదములునే కారణము. కావున స్త్రీలందరమువారికి మనఃపూర్వకవందనము లర్పింపవలసియున్నది. వారుచేసిన మరియొకగొప్పపనియేమనగా వారితోటలోని తాటిచెట్లను ఎప్పటికిన్నికల్లుకీతకివ్వరాదని శాశ్వతంగావ్రాసియుంచినారు. గాంధీగారి శిష్యులవలెకాకుండా వారిశిష్యులుపూనినప్రతిపని సంతోషముతో నిర్వహించేవారు.

సుమారు 30 సం॥ల క్రితం వారితోకూడాకలిసి బెంగుళూరులలో నెలరోజులుంటిని. వారనుకున్న పనులు దినచర్యగంటలప్రకారం చేస్తూంటూ, రాత్రిళ్లుఎప్పుడు మేములేచిచూచినను గ్రంధములువ్రాస్తూనేయుండువారు. చిన్నపిల్లలకు, పెద్దవారికి, ముసలివారికి అందరికి ఉపయోగపడునట్లు, అనేకగ్రంధములువ్రాసినారు. ఇప్పుడందరును కవులగుటచే వానినుపయోగించుటతక్కువైనది. అయితే వారిగ్రంధములను క్లాసుల్లో పాఠపుస్తకములుగాను, వారిస్వీయచరిత్ర పెద్దక్లాసుల్లో పాఠపుస్తకముగాను ఉపయోగించిన జీవకోటిసుఖవంతముగాను, ఆనందముగాను, అభివృద్ధిలోకిరాగలదని భగవంతునిప్రార్థించుచున్నాను.

# అనాథబంధు

—✶—

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

●



అబలల, సంఘానికికట్టువడి తమవ్యక్తిస్వాతంత్ర్యమునుగూడ కోలుపోయి, సంఘముచేతి కీలుబొమ్మలై, సంఘదురాచారపిశాచాపీడితలై, కృంగి కృశించి పోవుచుండిన యనదల-పాలిటి, యాపద్బాంధవుడు, తండ్రి, దైవసముడు; నేటికి నూరేండ్లే కాదు; ఇక వెయ్యేండ్లకైనను మరువరాని మహోపకారి.

వృద్ధుని పెండ్లాడి, దురదృష్టముచే నాముదుసలి భర్త పరమపదించెనేని ప్రపంచము ఎరుగని యా అమాయకపు పిల్లల శిరోముండన మొనర్చి మహాఅపరాధినివలె నిరపరాధినులను ఆరూఢయౌవనవతుల మూలబడద్రోయుచూ, కాటికి కాలుచాచియుండినను కన్యలనన్వేషించు స్వార్థపరులను చూచి, కన్నీటి కాల్వలు ప్రవహింపజేసిన కరుణానిధి.

దేశకాల సంఘ, శాస్త్ర, ఆచార, వ్యవహారము లొకటిమైయుండ, తానొక్కడొక్కవంక నెదర్చి కడతేరిన ప్రతిభాశాలి. నేసంస్కర్తలమని పేరుకై ప్రాకులాడు కొందరివలె "శుష్కోపచారాలు, శూన్యహస్తాలు" చెయ్యలేదు. అనాథోద్ధరణకై బద్ధకంకణుడై పూర్వాచార పరాయణులతో శాస్త్రవేత్తలతో యెన్నోదినములు వాదోపవాదములొనర్చి చివరకు కార్యముసాధించిన కార్యదీక్షాదక్షుడు.

స్త్రీజన్మహక్కులియ్యవి, వీనికంతరాయములు గలిగించుట స్వార్థపరుల యన్యాయము అని సంఘమునకు నిదర్శనా పూర్వకముగా వెల్లడిజేసి భ్రూణహత్య, శిశుహత్య, ఇత్యాది దోషములకు గురికాక అనాథలనుద్ధరించిన గురువర్యుడు. సంఘసంస్కరణకై యెన్నియో నిందలబొంది అభియోగములకు గురియైన యోర్పుశాలి.

యీ మహామహునకు అబలాశ్రేయమెంతటి ముఖ్యోద్దేశమో, అంత కినుమడుంగు లాంధ్రభాషా యోపాభ్యున్నతికై కృషిచేయుట. చిన్నతనమునుండియే వీరికిమాతృభాషయందాసక్తిమెండు. వీరాంగ్లమున ప్రవేశపరీక్ష యందు తీర్ణులైరి. చాలాకాల మాంధ్రపండితులుగా నుండిరి.

పెద్దనార్యునట్లు వీ మహాకవియు నూతనగ్రంథరచనలకు మార్గదర్శకుడయ్యెను. కొందరాంధ్రకవుల చరిత్ర నేటికిరచించిరి; కాని యీనాటికి "గద్యకవిబ్రహ్మయే" ప్రప్రథములనుట నిర్వివాదాంశము. "రాప్ వెక్ఫీల్డు"న కనుకృతియగు రాజశేఖరచరిత్ర మను నవలను రచించి తెనుగు నవలలకు మార్గదర్శకులైరి. శకుంతలాది సంస్కృత నాటకముల నాంధ్రీకరించిరి. స్వీయ చరిత్రలు, జీవితచరిత్రలు, వ్యాసములు, ప్రకృతి శాస్త్రములు, మొదలగు వాఙ్మయశాఖలకు త్రోవజూపిరి. యేతత్కారణములచే గద్యకవిబ్రహ్మయన్న బిరుదము వహించిరి. ఆనాడితర కవులెవ్వరునూ వీరివలె వివిధరచనలచే భాషాయోషను సైసేసినట్లు గానరాదు. మానవసేవయే మాధవసేవయని సంఘసేవాపరాయణుడై, ప్రకృతి పరిశీలనమే తత్వపరిచయమని, భాషాసేవ యొనర్చి ఆంధ్రమాత ఋణవిముక్తుడైన త్యాగి.

శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు 16-4-1848 జన్మించి 1919 లో భౌతిక శరీరమును త్యజించిరి.

వీరియనంతరము నూరేండ్లకయిననూ యిట్టిసంస్కర్త లవతరించి అనాథలకు, అబలలకు, జీవిత, జీవనోపాధులగలిగించు శరణాలయముల నెలకొల్పి యేతన్మూలమున లలితకళల నేర్పి ఉద్ధరింపబూనిన నెంతయో ముదావహము. శ్రీ పంతులుగారిపట్ల మనము చూపు కృతజ్ఞతయు నదియేయై, ఆచంద్రతారార్కము అనాథసేవయొనర్చుచో, అయ్యదియే శ్రీపంతులవారి ఆత్మకు శాంతి.



ఎనామెల్ బోర్డులు
మీ
వ్యాపారమును
వృద్ధిచేయును
శాశ్వతము
శోభావంతము
మద్రాస్ ఎనామెల్ వర్క్సు లిమిటెడ్
65 సైదన్‌హామ్సు రోడ్డు ..... మదరాసు

# శ్రీ వీరేశలింగం వార్షికవర్ధంతి

శ్రీ డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు



ఈశ్వర భక్తియుక్తుని క్షితీశ్వర మాన్యుఁ బరోపకారి శా
శాశ్వతకీర్తిఁ గ్రామముఖ శత్రువిజేత వివేకవర్ధనా
ర్ధశ్వసనోపయోగమతి రావుబహద్దరు కందుకూరి వీ
రేశ్వరు మంత్రిపుంగవుఁ గవీంద్రు మదిం గొనియాడ జెల్లదే.

—ఆధునిక కవిస్మరణము.

భాషారచనయందు స్వాతంత్ర్యమువహించి తీయనివాకిండ్లు తీసినాడు. విజ్ఞానదృష్టి మాపిన శాస్త్రములు చీల్చి జనమనోదాస్యంబు జంపినాడు. కులమతద్వేషశృంఖలల నుచ్ఛేదించి జాతీయభావంబు జాటినాడు. కుహనామతాచారకుటిలకృత్యము లాపి పరమాస్తికవ్యక్తి నెఱపినాడు. ఆదయుంవ్రతమాతృదేశాభిమాని, సంఘసంస్కారభారదీక్షా తపస్వి యలరు వీరేశలింగ మహర్షి యొకడె ప్రస్తుతాంధ్రోద్ధ్యమునకు బ్రహ్మయగుచు.

రాయప్రోలు సుబ్బారావుగారు.

దేశము సాంఘిక దురాచారములకులోనై, అజ్ఞానాంధకారమున మునిగియున్నతరి, స్త్రీలు విద్యాగంధమెరుగక దుర్భర దాస్యమున దగుల్కొనియున్నయెడ, పురుషులు నిరక్షరాస్యులైయున్న కాలమున, కళావంతులు, పతితులు, హరిజనులు, దైన్యనికృష్ట జీవనము గడుపుచున్న సమయమున పామరులకు అవంతయేని బోధపడని గ్రంధరచనలతో కవిపుంగవులు కాలముగడుపుచున్న రోజులలో, అధికారుల అత్యాచారముల వలన అడంబరములవలన, అన్యాయప్రవర్తనవలన, లంచగొండితనము వలన, జనసామాన్యము పీడింపబడి, కృంగిపోవుచున్నదినములలో, ఘనుడు, వీరుడు వీరేశలింగం జ్ఞానభాస్కరుడు ఉదయించి, దేశము నావరించిన ఘోరతిమిరమును పారద్రోలి ఆంధ్రజాతిని మేల్కొలిపెను. మహాతేజస్వి వీరేశలింగం తగుస్థేమముకాని,ధనస్తోమముగాని లేకయే పరమేశ్వరునిపై భారముంచి, పట్టుదలతో, ఉత్సాహముతో తాను ధర్మమని నమ్మిన దానికై యెట్టి అవరోధములనైన ఉల్లంఘించి తనకార్యమును సాధించి జయముపొందిన సాటిలేని మేటి వీరేశలింగం. తనప్రతిష్టకు భంగముకలుగునని మిత్రులు వారించినను కల్లలు పలుకని సత్యవాది వీరేశలింగం. సర్వమును ఈశ్వర ప్రీత్యర్థము అర్పించి, సత్యనిరతియే జీవితనావకు చుక్కాని యని నమ్మిన ధీరుడు వీరేశలింగం.

సార్థకనాముడు వీరేశలింగం
సంఘసంస్కరణకు పునాది వీరేశలింగం

నూతన సారస్వత నిర్మాణకర్త వీరేశలింగం.
తెనుగు వచన ప్రబంధమును మొదటచేసినది ,,
మొదట నాటకమును తెనిగించినది ,,
మొదట ప్రకృతి శాస్త్రమును రచించినది ,,
మొదట ప్రహసనము వ్రాసినది ,,
మొదట చరిత్రమును రచించినది ,,
స్త్రీలకై మొదట పుస్తకమును వ్రాసినది ,,
శతాధిక గ్రంధకర్త ,,
త్యాగి, నిరాడంబర జీవి ,,
కార్యదీక్షాపరుడు ,,
దురాచార భంజనుడు ,,
స్త్రీజనోద్ధారకుడు ,,
మద్యపాన నిషేధమునకు మార్గదర్శకుడు ,,
వడుపువృత్తిని బోనడచినవాడు ,,
అధికారుల లంచగొండితనమును అణగద్రొక్కినవాడు వీరేశలింగం
హరిజనులకు శరణ్యం ,,
నిష్కామ కర్మయోగి ,,
తన తనుధనమనముల ప్రజలకు ధారవోసినవాడు ,,
ఆంధ్రుల సర్వతోముఖ వికాసమునకు కర్త ,,
ఆంధ్రాభ్యుదయమునకు దారిజూపినవాడు ,,
అవతారపురుషుడు ,,
అమరజీవి ,,

"నా జీవితంలో సాధించవలసిన కార్యములు యింకను యెన్నోవున్నవి. అవి సాధింపబడకపూర్వమే అసువులు వీడవలసివస్తున్నది. అజ్ఞానంలో, అమాయకత్వంలో, జీవితసంస్కారంలేని ప్రజాసామాన్యానికి విద్య, విజ్ఞానము, సమానత్వము, సంస్కారం కలిగించడానికి కృషిచేయాలని కోరుతున్నాను. నా అనుచరులు, మిత్రులు, సంస్కరణాభిలాషులు యీబాధ్యతను నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను."

ఆయన ఆశలు ఆయన మిత్రులు యెంతవరకు నెరవేర్చిరో, ఆశయముల ననుష్ఠించిరో గుండెలపై చేయివేసుకొని ఆత్మపరీక్ష చేసుకొనవలసిన సమయమిది; పరీక్షించుకొని దిద్దుకొనవలసిన తరుణమిది; దిద్దుకొని జీవితమును ఆయనమార్గమున నడిపి, ఆయన ఆత్మకు సంతోష మొనగూర్చు కాలమిది. వారిసంస్థలెట్లున్నవో పరిశీలింపుడు. అవి యథావిధిగ, సక్రమముగ నడపబడుచున్నవా యని పరికింపుడు. వారి శిలావిగ్రహము మనకు వారిని అనుదినము జ్ఞాపకపరచి కార్యశూరుల జేయుచున్నదా? ఎండకు ఎండి, వానకు దడిసి, పాదము విరిగి-అయ్యో! నిండుకీర్తి గడించిన నేరమునకై—యిట్లు బాధపడుచున్నాడా అనిపించుచున్నదా? సోదరులారా! మేల్కొనుడు, నడుముకట్టుడు, ఆయనవలె పట్టుదలతో, దీక్షతో, పనులుజేయ భగవంతుడు మనలను ఆశీర్వదించుగాక!

"ఒంటివాడవునీవు కందుకూరి, నేడుకంటిపాపవునీవె కందుకూరి.
నినుబోలు వారెవరు కందుకూరి, నీవెనవయుగపు నిర్మాత కందుకూరి"
ఘనకీర్తికాయుడవు కందుకూరి, నీవు కలకాల జీవివి కందుకూరి.

# కందుకూరి మహోకః

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

బ్రాహ్మణ్యం మూవత్తూ భస్మీపటలం అయిపోయింది; పోతూవుంది. మన ఆచారవ్యవహారాలేమీ ఉండవు. అగ్రవర్ణంలోనే ఈముసలం పుట్టింది. తక్కిన వర్ణాల మాట చెప్పనక్కరలేదు. కర్మాగత్రాపోయి తురకతంతు వచ్చిపడింది. ఇదేదో ఏకత్తుకే వస్తా. కాని తుదముట్టా సాగుతుందా? సాగడానికేముందీ; సిరి అబ్బదుకాని, చీడ నిమిషంలో అబ్బుతుంది' అని కొందరూ,

'ఆడదానికి చదువూ సంధ్యా ఎందుకూ? అందువల్ల మంచిఏమైనా ఉన్నదా? చదువువస్తే ఇంట్లోఇమిడి జాగ్రత్తగావుంటారా? చదువులేనివాళ్లతో మాటాడుటకే దుర్ఘటమయిపోతూవుంటే; ఇక చదువుకున్నదానితో మాటాడగలమా? వీళ్లకు చదువనే దురాచారం తెచ్చిపెడుతున్నారు. ఈ దురాచారం దుంపనాశనానికే. మొత్తానికి ఇంటిసంగతి రచ్చకెక్కుతూవుంది. చదువురానివాళ్లింతవరకూ హాయిగబ్రతకలేదా? వీళ్లు బ్రతక్కపోతారా? ఇందుకు ప్రత్యేకంగా స్కూళ్లూగీళ్లూ ఎందుకోయ్; అనవసరం. ఈ తత్వం బ్రహ్మదండిలా దేశమంతా అల్లుకుపోయింది. స్వేచ్ఛఅంటారు. స్వేచ్ఛదేనికీ?' అని కొందరూ,

'కాదు - మునుపటి వ్యవహారధర్మాలుఅన్నీ మాశిపోయాయి. చాలా జాగ్రత్త పడవలసినరోజులు వచ్చాయి. జడ్డులా ఈడిగిలపడుతూ కూర్చున్నందువల్ల లాభంలేదు. తెలివితేటలు రావడానికీ, చెప్పినవిషయం సులువుగా, త్వరగా గ్రహించడానికీ చదువువుండి తీరాలి. కాకపోతే లోకవ్యవహారాలూ దేశవార్తలూ, వ్యవస్థలూ తెలియవు. తల్లికి తెలియనినాడు పిల్లకూ తెలియదు. అందువల్ల అనర్థం ఎంతైనా ఏర్పడుతుంది. పడిందిప్పటికే. పూర్వంలావుండాలంటే ఇప్పుడేమాత్రమూ పనికిరాదు. పరదేశపాలనం వచ్చిపడ్డాక, పాలుత్రాగే పిల్లలాగు స్త్రీలుంటే దేశంపాడైపోతుంది. కాబట్టి ఇందుకు కావలసిన సంస్కరణలన్నీ అవసరాన్నిపట్టి జరిగితీరాలి. ఆలాజరుగనినాడు అనంతమయిన నష్టం ఏర్పడుతుంది. ఇంతకూ ఆయన మహాకవీ, పండితుడూ, శాస్త్రజ్ఞుడూ, కాలజ్ఞుడూ సత్యవాదీ, విచక్షణుడూ, నిష్కపటీ, నిర్మలహృదయుడూ, లోకప్రియుడూ, ధీరుడూ, త్యాగీ కావడంవల్ల సాంఘికంగానూ, రాజకీయంగానూ సంస్కరణమార్గాన్ని సర్వవిధాలా, మనోవాక్కాయకర్మలా అవలంబించి, పరిపూర్ణుడూ, ఉత్తీర్ణుడూ అయ్యాడు. దూరంఆలోచిస్తే ఆయనకు ఆయనేసాటి' అని కొందరూ,

రకరకాలుగా రావుబహదూర్ కందుకూరి వీరేశలింగంపంతులుగారిని గురించి నేను రఘువంశం చదువుకుంటూన్న రోజుల్లో చెప్పుకునేవారు. ఈ ప్రశంసలు

వింటూవారి గ్రంథంకాని, వ్యాసంకాని, కథకాని, ప్రహసనంకాని కనిపిస్తే నిద్రాహారాలు మానివేసి చదువుతూ, అందలి విషయాన్నిగురించి ఆలోచిస్తూ, నాలో నేనే తర్కించుకుంటూ ఉండేదాన్ని. సునిశితమయిన ఆయన విమర్శనలూ, రచనా, కథాసంవిధానమూ, నన్ను బాగా ఆకర్షించాయి. వారి రచనల్లో ఎవ్విధమయిన సంశయమూ, సందిగ్ధమూ లేకపోవడంవల్ల పరులను అడిగి తెలుసుకోవలసిన పనేమీ నాకు లేకపోయింది.

స్త్రీవిద్యాభివృద్ధి కేకాకుండా, వారి పురోభివృద్ధి కానాడు ఆయన వేసిన పునాదుల మీదనే నేడిన్ని కట్టడాలు బయలుదేరాయి. పాతాళంలో పాతుకుపోయిన పాత పునాదుల్ని వారెంత నేర్పుగానో పెల్లగించి నూతననిర్మాణానికి మార్గదర్శకులయ్యారు. గ్రంథస్థమయిన ఇలాంటి విషయాలు స్మృతికి తగిలినప్పుడల్లా హృదయం పల్లవిస్తూ వుంటుంది. స్త్రీల అభ్యున్నతికి వారుచేసిన కృషి ఇంతా అంతా కాదు.



క్రమంగా నేను కావ్యాలు ముగించి నాటకాలు చేతపట్టి కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలం చదువుతూ శ్రీపరవస్తు రంగాచార్యుల వారి మొదలు ఇంతవరకూ జరిగిన అనువాదాలన్నిటినీ జాగ్రత్తగా చూశాను.

'యాస్యత్యద్య శకుంతలేతి హృదయం
సంస్పృష్ట-ముత్కంఠయా'

అనే శ్లోకానికి పంతులుగారు—

'కొందలమందె డెందము శ
కుంతల నేడిదె యేగ నంచు....'

అనువాదంలోని రమ్యతా, సరసతా, కూర్పూ మరెందులోనూ కనిపించవు. అంతేకాదు, ప్రయాణసౌకర్యాదులు కాని, సాధనసామగ్రులు కాని తక్కువైన ఆకాలంలో వారు ప్రతీ పల్లీ, పట్నం పర్యటించి, విసుపూ విరామమూ లేకుండా అనేకశ్రమతమాలకు సహించి 'ఆంధ్రకవులచరిత్రము' మనకు ప్రసాదించి భాష కెంత మహోపకారముచేసిరో

మానవులు చెప్పలేరు. సకల సౌకర్యాలూగల ఈనాడు బయలుదేరిన చరిత్రగంథాలన్నీ అసమగ్ర, అసంపూర్ణ, అసంబద్ధాలతో నిండి, తిరిగి వారి గ్రంథాన్నే చూడమంటున్నా యంటే వారినిగురించి వేరే వ్రాయనక్కరలేదు. ఇందుకు—

'కందుకూరి వీరేశలింగమ్ము సుకవి' అను అభియుక్తి ఈ మహాకవికి చక్కగా తగివున్నది.

నేడు స్త్రీవిద్యాపురోభివృద్ధులగురించీ, వారికి అన్నిరంగాలలోనూ తగిన గౌరవ ప్రపత్తులూ, సత్కారాలూ కలుగుచేయడాన్నిగురించీ, ఇంకా ఏమేమిటో అభ్యుదయ పదవు లందించడాన్నిగురించీ గొప్పవారమనుకుంటూన్న పలువురు పెద్దలు ఉపన్యాసాల మూలంగాను వ్యాసాలమూలంగానూ తమతమ అభిప్రాయాలను ఆడంబరంగా వెల్లడిస్తున్నారేకాని, ఆత్మశుద్ధమయిన క్రియారూపాన్ని దాల్చలేదన్న విషయం రాజమహేంద్రవరం వెళ్లినప్పుడు శ్రీ పంతులుగారి శిలావిగ్రహాన్ని చూసిఅనుకుంటూ ఉంటాను. ఇందుకు—లోకం ఏర్పాటుచేసిన స్మృతిచిహ్నాలూ, వర్ధంతులూ వారి త్యాగపూర్వక నిష్కామ కర్మయోగానికి తార్కాణం.

అయితే, వారింత ప్రతిభాశాలురూ, కార్యదక్షులూ, యశఃకాయులూ కావడానికి కారణం షట్కర్మయుక్తా, సహచరీ, ధర్మపత్నీ అయిన రాజ్యలక్ష్మమ్మగారు.

ఇదంతా ఎందుకు—శ్రీ పంతులుగారు స్త్రీపునర్వివాహ సంస్కరణవిధానంలో, వాదోపవాదాలలో, శాస్త్రానువాదంలో, సునిశితవిమర్శనలలో, సాహిత్యచర్చలలో, బహుభాషాపాండిత్యంలో, అనుపమాన రచనాధీపటుత్వంలో, బోధనాపద్ధతులలో, నిర్మాణకార్యక్రమంలో, రాజకీయ పరిజ్ఞానంలో ప్రదర్శించిన ప్రతిభానైపుణ్యం—'క్వసూర్యప్రభవోవంశః, క్వచాల్పవిషయా మతిః' అన్నట్లు ఊహాతీతమూ, అలేఖ్యమూను.

నాటికి నేడు పంతులుగారు చేయగా మిగిలినవారి మనోగతాభిప్రాయాలను క్రియా రూపంలో పెట్టడానికే అవతరించారా అన్నట్టు బద్ధకంకణులయిన శ్రీ డాక్టరు కే. ఎన్. కేసరిగారు ఈనెల తమ 'గృహలక్ష్మి'ని వారి 'శతవార్షికవర్ధంతి సంచిక'గా ప్రచురించి, తమ కీర్తిచంద్రికలను దిగంతాలకు వ్యాపింపజేసి లోకపూజ్యులయ్యారు.

# శ్రీ వీరేశలింగ స్మరణ చిహ్నములు

శ్రీయుత కామరాజు హనుమంతరావుగారు



మానవుడు అనంతవికాసము జెందగల స్వతంత్రజీవిగదా? అయినను గతానుగతికుడై వివేకము గోల్పోయి కేవల యంత్రప్రాయుడుగ కాలక్రమమున మారుచుండును. ఒకప్పు డుపయుక్తములుగనున్న నియమములు, ఆచారములు, సంస్థలు కొంతకాలమునకు హానికరములుగ పరిణమించినను, అది గమనించక అంధునివలె ననుసరించును. ఈతీరున సంఘమువారెల్లరు కొన్ని సమయముల మూఢ్యవశులై దుఃఖసాగరమున మునుగుదురు. సుమారు డెబ్బది సంవత్సరములక్రిందటి ఆంధ్రదేశమును పరికింపుడు. మతసాంఘికరాజకీయాది సర్వవిషయములందు దాస్యశృంఖలాబద్ధమై యుండెననుట యతిశయోక్తిగాదు. పరమేశ్వరుని మరపించు శుష్కకర్మకాండలు, సంఘమును ఛిన్నభిన్నములుజేయు అమానుషవర్ణ నియమములు, స్త్రీజాత్యభివృద్ధికి భంగకరములగు అతిబాల్యవివాహ నిర్బంధవైధవ్యాది దుర్భరదురాచారములు, జన్మస్వాతంత్ర్యముల నరికట్టు నిరంకుశ రాజశాసనములు, నైతికజీవనము రూపుమాపు వేశ్యావృత్తి మద్యపానాది ఘోరదోషములు ప్రబలి సంఘమును పీల్చి పిప్పిచేయుచుండెను. ఈదుర్వృత్తులనెల్ల మహాశత్రువులుగ పరిగణించి వానివిధ్వంసమునకై భీకరసంగ్రామము సలిపిన యోధాగ్రేసరుడు వీరేశలింగము.

అతని జీవితకాలము విశేషముగ అధర్మవిచ్ఛేదనములో గడచినను, అతడు ధర్మసంస్థాపనమునకై కూడ పూని నూతనోద్యమముల ప్రారంభించినాడు. సర్వమతసారము విద్యార్థులకు గరుపుటకై, నిమ్న జాతీయుల కస్పృశ్యతబాపి అగ్రవర్ణములవారితో కలిపి విద్యనేర్పుటకై, స్త్రీలయజ్ఞానము తొలగించుటకు వారికి గూడ నుచితవిద్య నొసంగుటకై, ఆస్తికోన్నత పాఠశాల నెలకొల్పినాడు. వితంతువులకేగాక యితర స్త్రీలకును నుపయోగించులాగున శరణాలయము ప్రతిష్ఠించినాడు. తన యావచ్ఛక్తియు కాలమును దేశ సేవకై వినియోగించినాడు. తుదకు తనయాస్తియంతయు వితంతువుల యభివృద్ధినిమిత్తము దేశమాతకు కానుకగ సమర్పించి యస్తమించినాడు. నవీనాంధ్రలోకమున ధర్మమార్గప్రదర్శకుడు వీరేశలింగము.

సేవారూపముదాల్చని భక్తిని, కార్యముగ పరిణమింపని వాక్శూరత్వమును ఆతడు గర్హించువాడు, తోడిజనులలో పౌరుషము పురిగొల్పుటకై ఆతడు ప్రయోగించిన హాస్యవీర రసపూరిత వాగ్జాలమునకు మేర లేదు. కార్యోత్సాహము మెచ్చుకొనుచు కార్యశూరుల సన్మానించినాడు. స్త్రీ పునర్వివాహోద్యమమున నిర్భయముగ పాల్గొని తనకు చేయూతనొసంగిన కీర్తిశేషులయిన బసవరాజు గవర్రాజుగారి గౌరవార్థమువారి చిత్రపటము రాజమహేంద్రవర పురమందిరమున ప్రతిష్ఠించినాడు. చిన్నవాడయ్యు తన్నుమించి సంస్కరణ మార్గమున ముందునడువ మొదలిడిన కీర్తిశేషులగు దేశిరాజు పెదబాపయ్యగారిని ప్రశంసించి యాతనితో తానును నడచి యాతని స్మరణసూచకముగ రాజమహేంద్రవరములో పురమందిరమున చిత్రపటమును ఆనందాశ్రమమున సమాధియు నెలకొల్పినాడు. సేవాపరాయణులందర నాదరించినాడు. నేడు ఆంధ్రదేశ కార్యరంగములన్నిటిలో గానవచ్చు ధైర్యస్థైర్యముల కంకురము ఆతడేనాటినాడు. నవీనాంధ్రజాతి పితామహుడు వీరేశలింగము.

వీరేశలింగయోధుని అమోఘాయుధము లేఖిని. అదిసునిశితము; విరామమెరుగదు ఆతడాంధ్ర పండితుడు; కవిశేఖరుడు. ప్రబంధముల వ్రాసిభాషాకోవిదుల మెప్పుబడసినాడు. మరియు నాటకములు,

ప్రహసనములు, నవలలు. చరిత్రలు, శాస్త్రములు, వ్యాసములు సులభగ్రాహ్యములగునట్లు బహుళముగ రచించి దేశమునావరించిన యజ్ఞానాంధకారము పటాపంచలుచేసినాడు. ఆంధ్రసారస్వతమునకు నూత్న కళ, నూత్నజీవము, నూత్నవికాసము కల్పించినాడు. అభినవ తిక్కన వీరేశలింగము.

వీరేశలింగమును స్మరించుటకై వేరేచిహ్నములు ఆంధ్రులు నిర్మించుకొనవలయునా? ఆతని గ్రంథములే, ఆతని సంస్థలే, ఆతనిచరిత్రప్రసిద్ధ జీవితమే శాశ్వతస్మరణ చిహ్నములు. ఆతని యడుగుజాడలలో నడుచుటకు వారింకను తప్పటడుగులు వేయుచున్నారు. దృఢత్వముజెంది దేశసేవయందగ్రేసరు లగుచు తమ జీవితములనే యాతని స్మరణచిహ్నములుగ జేయుటవారి కర్తవ్యము. వారిజీవితములందు వీరేశలింగము పోలికలు కనబడవలెను. వారిని చూడగానే వీరేశలింగము జ్ఞప్తికి రావలెను. ఆతడేకార్యములు ఏవిధమున చేసెనో, ఆకార్యములే ఆవిధముననే ప్రస్తుత ఆవసరానవసరములు, పరిస్థితులు చూచుకొనక చేయుచుండినచో, వీరేశలింగానుచరులని వారెట్లు తలంపబడుదురు? వీరేశలింగ మధిక్షేపించిన పూర్వాచారపరులవర్తనమే వారియందును గానవచ్చును. వీరేశలింగమువలె వారుతమ విధికృత్యములు, తన్నిర్వహణ విధానములు నిర్ణయించుటకై వివేచనాశక్తిని, కార్యాచరణముపట్ల ధైర్యపరాక్రమములను, దేశారాధనమునందు సంపూర్ణాత్మార్పణమును తమ జీవితములద్వారా వ్యక్తపరుపవలెను. అట్టిసద్గుణభూషితజీవితములే శ్రీవీరేశలింగ స్మరణచిహ్నములు. ఆసజీవచిహ్నములే హృదయమునుండి హృదయమునకు వెలుగును. ప్రసరించి యావజ్జాతిని వెలిగింప గలవు.



# శారద లేఖలు



★

సౌ భా గ్య వ తి క ల్ప ల త కు

నెచ్చెలీ!

కఠిన శిలాతలంబున పరిభ్రమించుటకంటె నిశితకంటకావృతపథంబున పురోగమించుటకంటె దారుణ సంగ్రామరంగముఖంబున వెన్నువిఱచి నిలుచుటకంటె సనాతధర్మపరాయణమై ఆచారశృంఖలానిబద్ధమై, అవిద్యాతమోగ్రస్తమై ఆరోగ్యామయావస్థలోనున్న ప్రజానీకములో క్రొంగ్రొత్తసంస్కారమును ప్రవేశపెట్టుట అత్యంతకష్టము. ఆ సంస్కారము ప్రజాహితమైనదేయగుగాక. దయాకలితమైనదేయగుగాక, అవినీతి నివారకమేయగుగాక ప్రజలుదానికి సులభముగా సుముఖులుగారు. మఱియు నా సంస్కరణకు రొదురొడ్డి నిలిచి అసంఖ్యాకవిఘ్నంబులుగలిగించి యాప్రయత్నమును నాశమొనర్పయత్నింతురు.

శ్రీ రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారుకడచిన అర్థశతాబ్దిలో ఆంధ్రప్రజానీకముతో గావించిన పోరాటమిట్టిదే. వీరేశలింగముపంతులుగారు విద్యార్థిదశవీడి వ్యావహారికరంగమున ప్రవేశించి నలుదెసలపారజూడగనే ప్రజలలో ఘనీభవించియున్న పూర్వాచారపరత్వము, ఉద్యోగులలో పెచ్చరిల్లియున్న లంచగొండితనము, వేశ్యాస్త్రీలనుభవించుచున్న హైన్యత, బాలవితంతువులుపడుచున్న కడగండ్లు, విద్యావిహీనస్త్రీలలో వ్యాప్తమైయున్న మూఢత్వము ఆయనహృదయమునుకలంచెను. వెంటనే సంస్కరణకు పూనుకొనెను.

దైవవశమునఆయన సంస్కారప్రియుడగుటయేగాక కవి, పండితుడగుటయు ఆంధ్రులపుణ్యమేయయ్యెను. అంతదనుక కవియైనవాడెల్లకావ్యమునో, శతకమునో విరచించుటో, పురాతనసంస్కృత గ్రంథమేదేని తెనిగించుటో తక్కమరియొకపుంత ఆంధ్రకవు లెరుగకుండిరి. వీరేశలింగనుకవి కలముచేపట్టగనే తెలుగులో క్రొంగ్రొత్తబాటలెన్నేనితెఱచెను. ఆంధ్రభాషకు మృదుమధురమగు వచనరచన ఆయనపెట్టినభిక్షయే. వచనములో కథలు, కావ్యములు, నవలలు, నాటకములు, వ్యాసములు, ప్రహసనములు, చరిత్రలు, శాస్త్రములు, జీవితములు, అనువాదములు, వాచకపుస్తకములు అన్నియు ఆయనవిరచించినవే. కావుననేఆయన గద్యతిక్కనయని వ్యవహరింపబడినాడు. అటులని ఆయన పద్యరచనాధురంధరుడుకాకపోలేదు. సామాన్యపద్యకావ్యములేగాక నిర్వచననిరోష్ఠ్య ప్రబంధములుగూడ రచియించి విద్వత్కవి యనిపించుకొనినాడు. భాషావిషయమున ఆయన యెంతవిశారదుడనిపించుకొనినను, అవినీతిపరులగు నుద్యోగులతో పోరాడుటలో నెంతయోధాగ్రేసరుడనిపించుకొనినను, స్త్రీలయెడకారుణ్యమువహించి వారినివిద్యావతులను జేయుటకును, వారికడగండ్లనున్మూలించుటకును, వారిహైన్యతను రూపుమాపుటకును, ఆయనచేసినంత తదితరములయెడ చేయలేదేమో అనిపించును. కావున ప్రాతఃస్మరణీయుడగు నామహిళాబాంధవునకు మనమహిళామండలి యెంతయైనఋణపడియున్నదని చెప్పవచ్చును. శ్రీ వీరేశలింగముపంతులుగారి జీవితములో స్త్రీ పునర్వివాహోద్యమము ఖలపత్త్రర

మైనది. ఈ మహోద్యమము సాగించుటలో ఆయనయెన్నియో కష్టనష్టములకు గురియయ్యెను. ఎందరో బలవద్విరోధుల దారుణచర్యలకు పాత్రుడయ్యెను. అయినను ఆయనయేమాత్రము జంకక, గొంకక, వెనుదీయక అనేకమంది బాలవితంతువులకు పునస్సౌభాగ్యములు కల్పించి కృతకృత్యుడైనాడు. ఆయనస్వాపతేయము నందలి విశేషభాగము ఈబాలవితంతువుల నుద్ధరించుటకే వినియోగమైనదనుటకు యిప్పటికిని రాజమహేంద్రవరమున ఆయనఆస్తిపై ధర్మకర్తలునడుపుచున్న వితంతుశరణాలయమే తార్కాణ.

స్త్రీలలో విద్యావ్యాప్తికలిగించుటకు శ్రీవీరేశలింగముపంతులు గారు పెక్కుగ్రంథములనువ్రాసిరి. ఆయనవ్రాసిన చంద్రమతీచరిత్రము, సత్యవతీచరిత్రము ఆదిగాగలవి ఆయన స్త్రీవిద్యాభిమానమును వేనోళ్ల చాటుచున్నవి.

వేశ్యాసంఘసంస్కరణకు శ్రీ వీరేశలింగముపంతులు గారు చేసిన కృషిసాటిలేనిది. పురుషునిస్వార్థమునకును భోగలాలసతకును ఒకతెగనుప్రత్యేకించి పతితలనుగాజేయుట ఆయనకెంతియో బాధకలిగించెను. ఒకవంక వేశ్యలకు వారినైచ్యతను తెలియబఱచి వివాహములకు ప్రోత్సహించుచు వేరొకవంక వేశ్యాలోలురైన పెద్దమనుష్యులనునిరసించుచు వారిపైధ్వజమెత్తెను. పత్రికలలో వీరిపరువుప్రతిష్ఠలు నశించునట్లు దుయ్యబట్టెను. ఈ అలజడికిజడిసి వారాంగనలచేపట్టుట గౌరవప్రదమనిభావించెడిపెద్దలు ఆ అకార్యమునెడ విముఖులుకాగా, తమహైన్యతనుగుర్తించిన వేశ్యాంగనలనేకమంది తమవృత్తియెడవిముఖులై వివాహములుచేసికొనుటకుద్యుక్తులైరి. శ్రీ వీరేశలింగముపంతులుగారిని ఆంధ్రమహిళలు కలకాలమునుస్మరించుటకు ఈ మూడు మహోపకృతులే చాలును.

ఈ 1948 సంవత్సరము ఏప్రియలు పదునారవతేదికి ఆయన తెలుగుసీమనుజన్మించి నూరుసంవత్సరములు నిండును. కావునఆయన శతవార్షికజయంతి ఆంధ్రావనియందంతటను మహోత్సాహముతో జరుపబడుచున్నది. శ్రీ పంతులుగారుమరణించి చాలకాలమైనది. అయిననేమి, ఆయనవాఙ్మయము, ఆయనమహత్తరసేవ మన దృష్టిపథముననుండి నన్నినాళ్లు ఆయనఅమరుడే. మనహైందవ సంప్రదాయములో మహాపురుషులు జన్మించిన దినమును, లోకకంటకులైన వారుమరణించినదినమును, పండువుగాభావించి వేడుకలుచేసికొను సదాచారము గలదు. ఈ ఆచారము మహోత్కృష్టమైనది. ఈ ఆచారముప్రకారమే రామ, కృష్ణాదులుజన్మించిన దినమునను, నరకాసురాదులు మరణించినదినమునను పండుగచేసికొనుచున్నాము. మఱిమంచివారుపుట్టుట, దుర్మార్గులునశించుట లోకమునకు పండుగేగదా.

ఈ కారణమున శ్రీ వీరేశలింగముపంతులుగారు జన్మించిన ఈ పదునారవతేదీ మహాపర్వదినముగ భావించబడినది. ఈ శుభదినమున, ఏమహామహుని యపారకృషివలన మనఆంధ్రమహిళలు, ఈపాటిచదువుట, వ్రాయుట, మహిళాసభలలో పాల్గొనుట, సంఘసేవచేయుట, మహాసంస్థలలో ప్రాతినిధ్యమువహించుట ఆదిగాగలయున్నతస్థితికి రాగలిగిరో, ఆమహనీయుడైన, మహిళాబాంధవుడైన శ్రీ వీరేశలింగముపంతులు గారిని భక్తితోస్మరించి చరితార్థలగుదురుగాక. శ్రీ వీరేశలింగంపంతులుగారికి ఇవియే నా నమోవాకములు.

ఇట్లు,

మిత్రురాలు

శారద

# ముఖ సౌందర్యమునకు




# రెండు శృంగార క్రీములు అవసరము

సౌందర్యరక్షణకు ప్రఖ్యాతిగాంచిన ఈ క్రీములను వాడండి.

ఎల్లప్పుడు మనోహరముగా నగుపడవలెనంటే ముఖమునకు మీరు రెండురకముల క్రీములను నిత్యము ఉపయోగించవలెను. మొదటిది: మంచి తైలములు కలిగిన పాండ్స్ కోల్డు క్రీమ్, చర్మమును శుభ్రపరచి మృదువుగానుంచుటకు. రెండవది: నూనె లేకుండా మృదువుగానుండు, పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్, రోజంతయు దుమ్ము, ఎండ తగులకుండా కాపాడుటకు.

మీ ముఖమును శుభ్రపరచుటకు పాండ్స్ కోల్డ్ క్రీమును వాడండి. చర్మములోనికి చొచ్చుకొనిపోవు నూనెలుగల ఈ క్రీమును మీ ముఖమునకు రాత్రులందు రాసి, వ్రేళ్లతో దానిని చర్మములోనికి ఇంకచేసి, తరువాత తుడవండి. అప్పుడు మీ ముఖము ఎంత పరిశుభ్రముగాను, తేజోవంతముగాను ఉండును! చెమటవల్ల చర్మగ్రంధులలో చేరు మాలిన్యము ఏమాత్రము యుండదు! చాల మృదువుగానుండును! మీ ముఖసౌందర్యరక్షణకై ప్రతి యుదయము పాండ్స్ వ్యానిషింగ్ క్రీము వాడండి. చల్లని పాండ్స్ క్రీమును ముఖమునకు తేలికగా రాయండి: అది చాల తేలికగా వ్యాపించును. ఏమాత్రము జిగటగానుండదు. ఎండ, దుమ్ము తగులకుండా ముఖమును రోజంతయు కాపాడును. ఇది అదృశ్యముగానుండి మీ సౌందర్యమునకు పుష్పసదృశమైన కోమలత్వమునిచ్చును.





జ్ఞప్తియుంచుకొనుడు—మాడ్చి వేయునట్టి ఎండాకాలపు ఎండవలన, శీతాకాలపు చలి వలనను, చర్మమునందలి స్వాభావిక తైలములు ఎండిపోయి చర్మము బిరుసుగాను, నల్లగాను ఉండును.



ఇంకనూ జ్ఞప్తియుంచుకొనుడు—చర్మగ్రంధులలోనికి లోతుగా పోయిన దుమ్ము, మాలిన్యపు కణములే చాలవరకు చర్మవైకల్యములకు కారణములగుచున్నవి.



ప్రతి రోజు పాండ్స్‌వారి రెండు క్రీములను వాడినచో ముఖము మృదులముగాను, తేజోవంతముగాను, ... ముగానుయుండి, ఎల్లప్పుడు యౌవనవంతముగానే యుండును. ఈ రెండు క్రీములతో మీ ముఖమునకు "సౌందర్యక్రమ శిక్షణ" యొసగుడు—...

# పాండ్స్


వ్యాపార వివరములకు:

యల్. డి. సేమూర్ & కం. (ఇండియా) లిమిటెడ్. బొంబాయి — కలకత్తా — కరాచి — మద్రాసు.

# గృహలక్ష్మికి పద్యరత్నాలు

కల్లూరు అహోబలరావు

వారల చరితలు జదువుము
వారల ధైర్యంబు, విద్య బల్మియు గనుమా
నారీమణి కుండఁగ జను
వీరత్వముఁ దెచ్చికొమ్ము ప్రియ గృహలక్ష్మి!

చిన్నతనమ్మున నేర్చిన
సన్నుత సుగుణములె కీర్తిసంపదఁ దెచ్చున్
వన్నెల వింజామరమును
యెన్నఁడుఁ బోలంగవలదు; హితగృహలక్ష్మి!

పనిలేక పొరుగుటిండ్లకు
జనబోకుము లేనిపోని జగడము వచ్చు
అనువునఁ గూర్చొని, పాఠము
లనో, పద్యములనో పఠింపు; లలి గృహలక్ష్మి!

సంగీత కళామర్మము
రంగారగఁ దెలిసి, పద్యరత్నము లెల్లన్
ఖంగునఁ బాడఁగ నేర్వుము
సింగారము స్త్రీలకిద్ది శ్రీగృహలక్ష్మి!

(సశేషము)



# లచ్చి సంసారం

శ్రీ సీతారాంగారు

(గత సంచిక తరువాయి)

తనకు ఊదరపొట్ట, పీకకాళ్లు తయారయినాయి. తన భర్త పూర్తిగా కృశించిపోయాడు.

షాహుకారుగారింట్లో బంధువు లెక్కువయినారు. అమ్మగారికి పురుడు దగ్గరకొచ్చివేస్తోంది. నలుగురూ నాలుగుమూలలా తిరుగుతూవుండడం మూలాన ఏవయినా అపహరించాలన్నా అవకాశందొరక కుండావుంది. విధివిరామంలేకుండా డాక్టర్లు వచ్చి ఆమెను పరీక్షచేస్తున్నారు. ఎప్పుడూ ఒకరన్నా ఆమెను కనిపెట్టే వుంటూవుంది. ఇప్పుడు షాహుకారుగారి అత్తగారు యింట్లో పెత్తనం ఛలాయిస్తూవుంది. ఇదివరకు 'అమ్మగారు' కొంచెందయగానయినావుండేది. ఈ 'అత్తమ్మ' గారు లచ్చిని వేపుకు తినేస్తోంది.

వర్షాలు వచ్చేశాయి. తన ఇంటిమీద ఆకులు లేవు. ఒంటిమీద సరిగా గుడ్డలు లేవు. తినడానికి తిండిలేదు. రెండోపిల్లవాడు శోషవచ్చి యీ రాక్షసలోకాన్నుంచి తప్పించుకుని ఎక్కడికో పోయాడు. "అమ్మా, ఆకలివేస్తోందే" అని యీ ప్రపంచాన్ని వీడేముందు గోలపెట్టితే యివ్వడానికి ఏమీలేక తనఎండిన స్తనాన్ని నోట్లోపెట్టింది. మాతృస్తనాన్ని నోటకరచుకుని గుడ్లుతేలవేశాడు.

వానలొచ్చేది, తనపిల్లడు చచ్చేది, లచ్చికి పనిమానడానికి వల్లా? ప్రపంచం అంతకర్కశమయినదా అని కొందరికి వింతకలుగవచ్చు - దయాభిచ్ఛములతో ఒకరినొకరు ఎంతకుపోషిస్తారు? - ఎంతకాలం పోషిస్తారు? రామిగాడు ఎంతకష్టపడుతున్నాడు! ఏదిఎలావున్నా లచ్చి తను పని మానగలదా? మానితే ఎవరికినష్టం? ఒకపూటమానవచ్చు; రెండుపూటలుమానవచ్చు; అంతకుమించిమానితే జీతంతనకెందుకిస్తారు? జీతంలేకపోతే ఆమాత్రమయినాప్రాణాల్ని బొందిలో నిలబెట్టుకోవడమెట్లా? నిండునెలలతో పనికివచ్చినా "ఏం? ఎందుకొచ్చావే? పోయిఇంట్లో పడుకోకపోయినావా?" అని ఎవరడుగుతారు; షాహుకారుగారింట్లో తనమాట ఎవరికిపట్టింది? ఇరుగూపొరుగూవాళ్లకి చెప్పుకుందామంటే "రోలువెళ్లి మద్దెలతో మొరపెట్టుకున్నట్లు" వుంటుంది. వాళ్లుఅంతకంటె అధోగతిస్థితిలోవున్నారు. ఆ గుడిసెల్లోనుంచి శవం ఒకటయినా వెళ్లనిరోజులేదు. మొదట్లో కొన్నాళ్లు ఏడుపులూ పెడబొబ్బలుపెట్టినా రానురానువారికి చావంటే భయమూ, చచ్చినవాళ్లనిగూర్చి ఏడ్వడమూపోయినాయి.

రామిగాడికిజ్వరం తగులుతూవుంది. పెద్దపిల్లవాడు మంచంపట్టాడు. జ్వరంతోనే రామిగాడు పనిలోకి వెడ్తూవున్నాడు.

వానలుబాగా ఎక్కువయినాయి. మిల్లుకట్టివేశారు. రామిగాడికిపనిపోయింది. మళ్లీఎక్కడ తిరిగినా కూలిదొరకలేదు. ఊరువిడిచిపోతే ఏపనిఅయినా దొరుకుతుందేమో! ఊరువిడిచిపోదామంటే వంటిలో శక్తిఏది? రామిగాడి మనసు చెదిరిపోయింది. జ్వరంతీవ్రమయింది.

*          *          *          *

ఆరోజువాన కుండచిల్లిపడినట్లు కురుస్తోంది. ఇంకావాన ఎక్కువ అవుతుందనీ, తుపాను వస్తుందనీ ఎక్కడచూచినాగోల. సాయంత్రం వానకొంచెం తెరిపియిచ్చింది. లచ్చియథాప్రకారం పనిలోకిబయలు దేరింది - షాహుకారుగారిభార్యకు నొప్పులు ఆరంభమయినాయి. పదిమందిడాక్టర్లు ఆవిడచుట్టూనిలబడ్డారు. నర్సులు లోపలికివెడ్తూవస్తూవున్నారు.

బయటఉరుములు, మెరుపులు, పనిలోకివచ్చిందేగాని ప్రాణమంతా యింటిమీదనేవున్నది. తనభర్తకెలావుందో? పిల్లడెలావున్నాడో!

షాహుకారుగారియింట్లో ఎవరిపనులలోవారు మగ్నులయివున్నారు. బయటహోరునగాలి. లచ్చి దొడ్లోకివచ్చింది. నాలుగుబొప్పాయిచెట్లు అప్పుడేగాలికి క్రిందపడినాయి. చూస్తూవుండగా స్నానాల కొట్టురేకు దారంతెగిన గాలిపడగలాగా ఎగిరిపోయిఎక్కడోపడింది. గాలీ, వాన; ఇళ్లకప్పులు తాటియాకు దళ్లు, చెట్లకొమ్మలు, బొప్పాయిచెట్లు ఎగిరిపోతున్నాయి. తనగుడిసెవున్నదా? తనపిల్లడేంచేస్తున్నాడు? తనభర్తకిఎలావుంది? చీకటిపడిపోయింది. లచ్చిఇంట్లోకిపరుగెత్తింది. ఒకమూలకాసినిబియ్యం కన్పించాయి. ఇంకోమూల పాతగొంగళీఒకటి పడవేసివున్నది. తిండిలేకశుష్కించినపిల్లడు, జ్వరంతో చలికివణికిపోతున్న భర్త కళ్లకు కన్పించారు. నాలుగుప్రక్కలాచూచింది. ఎవరూ తనను చూడడంలేదు.

“అమ్మా”—తనకూనొప్పులు బయలుదేరినాయి. అంతాఅమ్మగారి గదిచుట్టూవున్నారు. చప్పుడు కాకుండా గొంగళితీసుకుని, బియ్యంమూట కట్టేసుకుంది.

“అయ్యో”—అమ్మగారు పెడబొబ్బలుపెట్టుతూవుంది. ఇంట్లోఅంతా గాభరాపడ్తూవున్నారు. షాహుకారుగారు మతిచెడినట్లు ఆయనభార్య వున్న గదిముందు నడుమువెనుక చేతులబిగించి ముందుకీ వెనక్కీ పచార్లు చేస్తున్నాడు.

లచ్చికీ నొప్పులు ఎక్కువవుతున్నాయి. కళ్లుతిరుగుతున్నాయి. ప్రపంచమంతా తిరిగిపోతోంది కళ్ల ముందు. నొప్పులుబాగా అధికంగావున్నాయి. కాళ్లుతడబడుతున్నాయి. బియ్యం, గొంగళీ విడవకుండా గట్టిగాపట్టుకుని ఎలాగో మెల్లగావీధిలోపడింది.

గాలీ, వానా!

ఆగాలిలో నిలబడ లేక పోతోంది-గాలితోసివేస్తోంది-చినుకులు మొహానరాళ్లుపెట్టికొట్టినట్లు చురుకు మని తగులుతున్నాయి. ఎలాగో ఒకపది అడుగులునడిచింది. ఇంతలో, “లచ్చీ—ఓ లచ్చీ!” అని పిలుపు, వెనక్కితిరిగిచూచింది. ఎవరోయింట్లోనుంచి తననుపిలుస్తున్నారు. మొదట్లోకంటికేమీకనపడలేదు. తర్వాత షాహుకారుగారి అత్తగారు వీధిచీడీలోనుంచి తనను పిలుస్తున్నట్లుగాతోచింది—తనచేతిలోమూటచూచిందా? అమ్మో! చూస్తే, ఏంచేస్తారో? ఇంట్లోకి తిరిగివెళ్లాలంటే భయంవేసింది. మాటవినిపించుకోనట్లుగా ముందుకుసాగింది; కానిగాలినడవనిస్తేనా? తనవెనకాలే ఎవరోవచ్చారు - షాహుకారుగారిపాలేరు, తను ఎడచేతితో లెంపకాయకొట్టిండే-ఆపాలేరు.

“ఏందేయ్ పట్టుకెడ్తున్నావ్? ఎవరూచూడటం లేదనుకున్నావుగామోసు” అన్నాడు. లచ్చి చేతిలోవున్నమూటను కలియబడిలాగుకుంటూ. విడవకుండా పట్టుకునేశక్తిలేదు లచ్చికి - అప్రయత్నంగానే మూటను విడిచిపెట్టేసింది

నొప్పులు బాగా తీవ్రమయినాయి. తనఇంటివైపుసాగింది మహాభారంతో. ఒక మెరుపు మెరిసింది. ఆ మెరుపు వెలుగులో పాలేరు లచ్చినిచూచాడు, ఆదైన్యదృశ్యం చూచేటప్పటికి అతనిగుండెలు చివుక్కుమన్నాయి. ఎక్కడినుంచో జాలివచ్చిపడిందతని హృదయంలో. ఛా, తనెంతపాడుపనిచేశాడు? పాపం ఎంతఅవస్థపడుతూవుంది? తనుమాత్రం బియ్యంయిదివరకు ఎన్నిసార్లు ఎత్తుకుపోలేదు? లచ్చినడవలేక నడవలేక మహాభారాన్నంతా తనమీదపెట్టుకున్న భూదేవివలె నడిచిపోతోంది. పాలేరుకళ్ళలో గంగబయలుదేరింది. "లచ్చీ! — ఆగు" అనికేకవేయబోయినాడుగాని నోటమాటరాలేదు. బియ్యం, గొంగళీ, యిచ్చివేయడానికి పరుగెత్తాడు.

ఇంతలో మహపెద్దరాక్షసిలాగ ఓ పెద్దచెట్టు విరుచుకుపడిందిమీద—చెట్టుక్రిందపడి నలిగిపోయాడు పాలేరు. లచ్చి నడుస్తూనేవుంది.

* * * *

రామిగాడికిజ్వరం చాలాతీవ్రంగావుంది. ఏదోఆలోచనలో మునిగిపోయి చాలాసేపటివరకూ ప్రపంచమే మరచిపోయాడు. ఒకమూలగాలీవానా దంచుతూనేవుంది. ఇరుగూపొరుగూ ఇళ్లువదిలేసి ప్రాణాలు రక్షించుకునేందుకు పారిపోతున్నారు. పారిపోతూ ఆచీకట్లో అతనిగుడిసెముందునిలిచి ఒకరిద్దరు "రామిగా" అని కేకలువేశారుగాని జవాబులేకపోవడంమూలాన లోపలఎవరూలేరనుకుని వెళ్లిపోయారు. రామిగాడు అసలు ఏతుపానుల్నీ లక్ష్యంచేసేస్థితిలోలేడు. ప్రపంచం విరుచుకుమీదపడినప్పటికీ అతనికింతకంటే కలిగేబాధేమిటి?

ఇంటిమీదఆకులు ఎగిరిపోయాయి. ఒకప్రక్కమంటిగోడపడిపోయింది. రామిగాడికి కొంచెం కొంచెం తెలివివచ్చింది. మెల్లగాలేచాడు. తడిసిపోయినతలపిండుకున్నాడు. ఓమూలపిండుతూవుంటే మళ్లీతడుస్తూవుంది. ప్రక్కనమంచంలో పిల్లడిని తడిమిచూచాడు - చల్లటిముద్ద. పలకరించాడు - 'ఊ' లేదు; 'ఆ' లేదు. గట్టిగావిదిలించాడు - ఊహూ. పిల్లణ్ణిభుజానవేసుకుని బయటికొచ్చాడు. అంతానిర్జీవంగావుంది. వాన కురుస్తూనేవుంది. మెరుపువెలుగులో పడిపోయిన ఇళ్లూచెట్లూ కన్పిస్తూవున్నాయి.

లచ్చియింకారాలేదు. ఇంతసేపు ఏమిచేస్తూవుందో? వానలోరాలేకపోయిందా? లేకదోవలో ఏచెట్టుక్రిందనయినా పడిపోయిందా? లేక ఎచెట్టుక్రిందనో నొప్పులుపడుతోందా? ఏమయిందిలచ్చి? ఇంతవరకూ ఎందుకురాదు? ఏ యిల్లయినావిరిగి మీదపడలేదుగదా? అయినా అలాఎందుకనుకోవాలి? వానగావుందని షావుకారుగారియింట్లోనే వుండిపోయిందేమొ! - రామిగాడిమనసు బేజారయిపోయింది. అసలుఆపూటలచ్చినిపనిలోకి తానెందుకువెళ్లనిచ్చాడు? లచ్చిఏమయింది? ఎవరినడగడం? లచ్చిలేకపోతే తానెందుకింకబ్రతికి? తనమీదకూడాఏచెట్టో, ఇల్లో విరిగి పడిపోకూడదు? ఇలామనోక్షోభపడుతూనే లచ్చికోసం బయలుదేరాడు - పిల్లడు భుజంమీదనేవున్నాడు - ఎక్కడినుంచో పెనుభూతంలాగు రయ్యిమంటూ ఓపెద్దరేకు విరుచుకుమీదపడింది. "అమ్మ చచ్చానురా బాబోయ్" అనిచతికిలపడ్డాడు. అదృష్టవశాత్తు చతికిలపడటంలో రేకుదూసుకుపోయింది. ఒకప్రక్కమాత్రం గీసుకుపోయింది. మెల్లిగాలేచాడు. ఈ ఖంగారులోపిల్లవాడు జారిపోయాడు. క్రిందబురదనీటిలో పొర్లాడుతోంది ఆ పసిపాపడికళేబరం. పిల్లణ్ణి గబగబా చేతుల్లోకి తీసుకున్నాడు. బాగాబరువెక్కువైనాడు - తడిమిచూచాడు - పూర్తిగా అశవదులుకున్నాడు. కానికంట ఒకచుక్కనీరయినాకారలేదు. ఎండినశరీరంలో ఏడవ్వాలన్నా నీరెక్కడవుంటుంది? పిల్లడ్నిగట్టిగా హత్తుకున్నాడుగుండెలికి. విడవలేకవిడవలేక ఆ కళేబరాన్ని భుజంమీదవేసుకుని లచ్చికోసం బయలుదేరాడు.

వెనక ఎక్కడనుంచో మహాసముద్రంలాగా నీరువచ్చేస్తోంది. ఆ నీటిమీద తేలినగుడిసెలు మెరుపుల వెలుగులో భూతాలలాగా తైతక్కలాడుతున్నాయి.

రామిగాడు నడుస్తూనేవున్నాడు. ఒకింతదూరాన ఓ మెరుపువెలుగులో రామిగాడికి లచ్చికనిపించింది. నెత్తిమీదనుంచి కారేనీరు మ్రింగుకుంటూ, ఒకచేతితో కడుపుపట్టుకుని ఇంకొకచేతితో గాలిలోత్రోవకై తడుముకుంటూ శరీరాన్ని ముందుకునెట్టుకువస్తోంది లచ్చి. ఆ గాలీవానలో – పరుగెత్తబోయాడు రామిగాడు; పరుగెత్తలేకపోయాడు. భుజంమీది పాఘడికశేబగం తనకుతెలియకుండానే జారిపోయింది. మెల్లగా లచ్చివైపు నడిచాడు. లచ్చిదగ్గరకొచ్చింది. వాళ్ళిద్దరూ దగ్గరకుచేరుకున్నారుగదా అని ప్రకృతి తనఆనందాన్ని తెల్పుతూ ఒకమెరుపునంపింది. ఆ మెరుపువెలుగులో ఆ దంపతులు ఒకరినొకరుచూచుకున్నారు. రంయ్‌మని గాలి వీస్తోంది. రామిగాడిని తరుముకువస్తూవున్న ప్రళయప్రవాహం వారినప్పుడే సగంవరకుముంచివేసింది. లచ్చి రామిగాడిని సమీపించింది. ఇకనడవలేక తనభర్తచేతులలోకి ఒరిగిపోయింది. ఆమెభారమును ఆపలేక ఆమెనుగట్టిగా కౌగలించుకుంటూ కృంగిపోజొచ్చాడు రామిగాడు – ప్రవాహం ఎక్కువయింది – కాని యింక ఏ ప్రవాహమయినా వారినేమిచేయుగలదు? వారు ఒకరినొకరు కలుసుకున్నారు. ఆ కలయికతో వారి బాధలన్నీ మటుమాయమయినాయి, ప్రకృతి వారిని కనికరించింది. వారీప్రపంచాన్ని మరచిపోయారు. అవును! తమపై దయచూపని ఘోరరాక్షస ప్రపంచాన్ని వారెందుకు జ్ఞాపకం వుంచుకోవాలి?

# సోమపాట (ద్విపద)

వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు, బి.ఏ., బియల్.

(సేకరించి పంపినది)

అని జనులందఱు నభినుతి సేయ
వినుచు ప్రాగ్వంశంబు[30] వేడుక జేరి
అయిదు దేవతలకై[31] యతిభక్తితోడ
ప్రాయణీయాదుల[32] బాగుగ జేసి
ప్రస్తోత[33] సామమున ప్రస్తుతి సేయ[34]
కౌతుకమున హోత ఘర్మ[35] నుతిసేయ
గంగ[36] ఏహి యటంచు కర్మనామమున
గంగపేరటి ఘర్మ గోవునుబిలిచి
పూజించి బితికిన పుణ్యకర్మగును.

సుజనులందరు గూడి సురుచిర మనుచు
అధ్వర్యు[37] డాశ్రావయా[38] యని యనిన

*   *   *

అగ్ని[39] ధ్రుడస్తు శ్రౌషటని[40] పల్కగను

*   *   *

విశ్రాంతు లయినట్టి వైదికులెల్ల
సుశ్రావ్యముగ హోత వౌషటని[41] గర్జింప
హోమంబు సేయగా హుతవహుం డపుడు
భామరో దిశలందు భాసిల్ల దొడగె.

తొల్లి కాలంబున తోయజనేత్ర
ముల్లోకములుగూడి[42] మఖమొనరింప
పోడమెను నీయజ్ఞ పురుషుని శిరము
పుడమిన ప్రవర్గ్య మని[43] బుధులంద్రు.
సోమవేది రచించి ముదముతోనగ్ని
షోమీయ పశుయాగ సుప్రయోగములు

*   *   *

పూబోడి యీమేకపోతు[42] పూర్వమున
తాబోయి తీర్థముల తపము సల్పినదో
ఎంత పుణ్యముజేసె యీమేకపోతు

*   *   *

ఈ యూపస్తంభాన[45] కిది కట్ట బడియె

*   *   *

పల్లవాధర దీని బాలించి నట్టి
గొల్లడు స్వర్గంబు గొల్లలాడె గదె
ఏమంద మేసెనో యీమేకపోతు
ఆమంద మేకలా నేమంద మమ్మ
చేయంగ నంగ[46] హోమము జూడజూడ
సాయమాయెను గదె సామజయాన.

---

30 ప్రాగ్వంశంబు—పైన 2-వ సంఖ్యను జూడుము.

ప్రాగ్వంశప్రవేశము రెండువిధములుగ నుండునటులున్నది. (1) సంకల్పానంతరము జరుగు శాలా ప్రవేశము (2) దీక్షాంగ శాలాప్రవేశము.

మొదటిది—యజమానః ఉదకుంభం పురస్కృత్య పత్న్యన్వారబ్ధః సోమారణీ సః సర్వైస్సంభారైశ్చ సహితః సర్త్విక్ ఆనోభద్రా ఇత్యాది శాంతి స పఠన్ శాలాం పరీత్య పూర్వాహ్ణే పూర్వద్వారేణ ప్రవిశతి.

శ ఢవ — అధ్వర్యుః యజమానేన ఆత్మనః సవ్యం పాణింగ్రాహయిత్వా యదోృదేవా
స ఆగురే యజ్ఞియాసోహ వామహే ఇతి శాలా మానయతి

దీనివెనుక పత్నికిని దీక్షాంగ శాలా ప్రవేశము.

31 అయిదు దేవతలు - ప్రాయణీ యెష్టికి సంబంధించిన అయిదుగురు:—

(1) స్వస్తి (2) అగ్ని (3) సోముడు (4) సవితా: ఈ నలుగురును తూర్పుమొదలు నాలుగుదిక్కులందును వీనికి నడుమ (5) అదితి. (శ్రౌతము. ద్రావిడగ్రంథము) తై. స 6-1-5 చూడుము.

32 అగ్నిష్టోమయాగమున రెండవదినము జరుగు ఇష్టి. అగ్నిష్టోమము అయిదుదినములు జరుగు క్రతువుగ నున్నది. మొదటిదినమున సంకల్పము, ఋత్విగ్వరణము. శాలాప్రవేశము, దీక్షణీయెష్టి- నవనీతదీక్షా ఇత్యాదులు. రెండవదినమున ప్రాయణీయాదులు, సోమక్రయణము, ప్రవర్గ్యసంభరణము, ఆతిథ్యేష్టి, ప్రాతః ప్రవర్గ్యము. ప్రాతరుపసదిష్టి, సాయంప్రవర్గ్యము. సాయముపసత్తు ఇత్యాదులు. మూడవదినమున: ప్రాతః వర్గ్యము, ప్రాతరుపసత్తు, సాయంప్రవర్గ్యము, సాయముపసత్తు ఇత్యాదులు. నాల్గవదినమున, ప్రాతఃవర్గ్యము ప్రాతరుపసత్తు, సాయంప్రవర్గ్యము, సాయముపసత్తు, ప్రవర్గ్యదక్షిణా, ప్రవర్గ్యోద్వాసనము, అగ్నిషోమీయా పశుయాగము, వసతీవరీగ్రహణము, పురోడాశయాగము ఇత్యాదులు. అయిదవదినమున, ప్రాతరనువాకము, గ్రహప్రతిష్ఠ, అభిషవము, సవనీయపశువు, ప్రాతస్సవనము, మాధ్యందినసవనము, తృతీయసవనము, దక్షిణాదానము, అవభృథము, ఉదనీయెష్టి ఇత్యాదులు.

యజ్ఞప్రారంభమునచేయు ఇష్టిప్రాయణీయేష్టి-అంతమునచేయు ఇష్టి-ఉదయనీయెష్టి అని తెలియుచున్నది.

33 ప్రస్తోత- ఉద్గాతృగణములో నొక ఋత్విక్కు.

34 యజ్ఞప్రకరణమున చెప్పబడు సామఋక్కులకు స్తుతములనియు, హోతృగణము చెప్పు ఋగ్వేద మంత్రములకు శస్త్రములనియు పేర్లు.

35 ఘర్మనుతి ప్రవర్గ్యములలో నొకయాగము. కాచిన నేతిలో ఆవుపాలును మేకపాలును కలిపిన హావిస్సునకు ఘర్మము అనిపేరు.

36 గంగఏహీత్యాది-ఘర్మయాగమునకు కావలయు పాలుపితుకు ఆవులకు గంగ, ఇడా, సరస్వతి, అదితి ఇత్యాది పేళ్లుగలవు. ఆ పేళ్ళతో ఆయాగోవును పిలుతురు. ఆవులుగలవారు తమతమ అభిమానములకొలది ముద్దుపేళ్లు పెట్టుకొనుటకలదు. బలరామకృష్ణులును వారియావులకు పేళ్లుపెట్టుకొనియున్నటుల భాగవత దశమ పూర్వభాగము 15-12 నందు లిఖింబబడియున్నది. అయితే అచట వారి ఆవులపేళ్లు చెప్పబడలేదు.

మేఘగంభీర యావాచా నామభిర్దూరగాన్ పశూన్
క్వచిదాహ్వయతి ప్రీత్యా గో గోపాల మనోజ్ఞయా.

ఈ శ్లోకమునకు పోతనమాత్యుని అమృతధారల జూడుడు :

రా పూర్ణచంద్రికా రా గౌతమీగంగ రమ్ము భగీరథరాజతనయ
రా సుధాజలరాశి రా మేఘమాలిక రమ్ము చింతామణి రమ్ము సురభి
రా మనోహారిణి రా సర్వమంగళ రా భారతీదేవి రా ధరిత్రి
రా శ్రీమహాలక్ష్మి రా శ్రీ మందమారుతి రమ్ము మందాకిని రా శుభాంగి
యనుచు మఱియుఁగలుగు నాఖ్యలుగల గోవు లడవిలో దూరమందు మేయ
ఘనగభీర భాష గడునొప్పజీరునాభీర జనులువొగడఁ బెంపునెగడ ॥

10-602

37, 38, 39, 40, 41;

ప్రధానహోమములకు ముందుచెప్పబడు మంత్రములకు ప్రయాజ అనిపేరు. ఈ ప్రధానహోమముల నుపక్రమించుటకుముందు అధ్వర్యుడు బ్రాహ్మగణములోని ఆగ్నీధ్రునిసంబోధించి "ఆశ్రావయ" అని ప్లుత స్వరముతో ప్రేషయిచ్చును. ఆ ప్రేషపై ఆగ్నీధ్రుడు "అస్తు" అని వెంటనే "శ్రౌషట్" యని యుచ్చైస్స్వరమున జెప్పును. అంతట అధ్వర్యువు హోతను సంబోధించి "యజ" యని ప్రేషయిచ్చును. ఈప్రేషను హోత వినినతోడనే "యే యజామహే" యుపక్రమించి ఆయాయాగములకు ఏర్పడియుండు యాజ్యమంత్రముల పఠించి "వౌషట్" యను శబ్దమును నుచ్చస్స్వరమున బలికి ముగించును. అంతట అధ్వర్యువు తాను ముందుగ సిద్ధముజేసికొనియుండు హవిస్సును హోమముజేయును.

ప్రేషయనగ ప్రేరణము అని చెప్పవచ్చును. ఆయా ఋత్విక్కుడు తాను చేయుపనికి హెచ్చరిక బడుట యనవచ్చును. శ్రౌతపదార్థనిర్వచనమున ప్రేషశబ్దనిర్వచన మిటులున్నది:

యజేత్యాది లోణ్మధ్యమ పురుషాన్త పదఘటితేన యేన వాక్యేన అధ్వర్వ్యాదినా
హోతాదిః ప్రేర్యతే తద్వాక్యం ప్రేషః (ప్రైష) ఇత్యుచ్యతే.

ఈప్రేషనిచ్చు సమయమున అధ్వర్యువు యజ్ఞవేదికకు ఉత్తరమునకూర్చుండి సన్నద్ధుడైయుండును. ఇతని కెదురుగను వేదికి దక్షిణమునను యజమానుడు(దీక్షితుడు)కూర్చునియుండును. యజమానునితూర్పువైపున బ్రహ్మ యుండును. ఆగ్నీధ్రుడు అధ్వర్యునకు వెనుకప్రక్క స్ఫ్యం అను కత్తిని చేతబట్టుకొని అంజలిపాణియై నిలువబడియుండును. హోతయు వేది కుత్తరమున కొంచెము వాయవ్యమున తూర్పుమొగమై కూర్చుండియుండును.

పైన ఉదాహరింపబడిన ఆశ్రాయన- శ్రౌషట్- వౌషట్ ఇత్యాది శబ్దములు వైదికశబ్దములు. లౌక్య వాఙ్మయమున వీని ప్రచారము మృగ్యముగనుండును. స్వస్తి- స్వాహా- స్వహా ఇత్యాదులవలెనివి వైదిక ప్రపంచమున నిలిచియున్నవి. వీని అర్థము సుగమముకాదు. పూర్వాచార్యులు చెప్పిన యర్థములు సంక్షేపముగ నీక్రింద తెలుపబడుచున్నవి.

ఆశ్రావయ-వినిపింపుము-గౌణముగ పిలువుము అని - అనగ యేదేవతకు ప్రీతిగ అధ్వర్యువు హోమము చేయుచున్నాడో ఆదేవతకు వినిపించి పిలువుము అని తాత్పర్యము దీనిని ప్రేష యిచ్చుట యందురు. (ఉర్దూ మాటలాడువారు "తలబ్ కరో" అను వాక్యమును యిట్టి యర్థముననె వాడునటులున్నది.)

అస్తు=అట్లు అగుగాక; అనగ అటులనె చేసెదను అని అగ్నీధ్రుడు అంగీకరించి బదులుచెప్పును.

శ్రౌషట్=ఉద్దిష్టదేవతను పిలుచుట; దీనికి ప్రత్యాశ్రవణమనియు ప్రత్యాశ్రుతమనియు పేరట.

(శ్రౌతపదార్థ నిర్వచనము.)

ఇదియొక దేవతానామముగ నుండునా? కీర్తిఘనులు బ్రహ్మశ్రీ వేదము వేంకటాచలమయ్యరు పండితులు బి. ఏ. బి. యల్ గారు పార్సీల (Parsis) జెండ్ అవెస్త (Zend Avasta) నుండు "శ్రఓష" శబ్దమునుగూర్చి యొకగొప్ప వ్యాసము వ్రాసియుండిరి. అది 1925 ప్రాంతముల రాయల్ ఏషియాటిక్ సొసైటివారియొక్క బొంబాయిశాఖవారి జర్నల్ లో ప్రకటింపబడినది. ఆ"శ్రఓష" అనునది"శ్రౌషట్" శబ్దమును పోలియున్నది. అయ్యరుగారి ప్రౌఢచర్చలో ఈ శ్రఓష అనునది అగ్నిదేవతాపర్యాయముగ తెలుపబడియున్నది. అట్లగునెడల అగ్నిష్టోమ సంబంధియగు మన "శ్రౌషట్" కు సాజాత్యము కలిగి యుండునని తోపగలదు.

(viz. No. I of Vol. XXV of the Journal of the Bombay Branch of Royal Asiatic Society-circa 1925).

ఆశ్రాయవాది
మంత్రభాష్యము
విద్యారణ్యభాష్యము తై. సం 1-ప్రర అను 11.

♦ ♦ ♦ ♦ ఆశ్రావయేత్య యమేవపాఠోఽత్రత్యః
ఓ శ్రావయ-శ్రావయ. ఓమాశ్రావయేతిచ త్రయం శాఖాన్తరీయం
హేఆగ్నీధ్ర యక్ష్యమాణదేవతాం ప్రతితుభ్యమిదం దీయత ఇత్యాభిముఖ్యేన
శ్రావయేత్యధ్వర్యునోక్తేసతి, సఆగ్నీధ్రోఅస్తిత్యంగీకృత్య శ్రౌషడితి శబ్దేన శ్రావయతి
హే దేవాః తద్విషయమిదం హవిర్దానం శృణుతేత్యర్థః
హేహోతః యజయాజ్యాంపఠేత్యర్థః
ఇతరస్యతు మంత్రద్వయస్య వినియోగ మాశ్వలాయనో హోతృకాండే దర్శయతి
♦ ♦ ♦ ♦ సర్వేవయం హోతారో ధ్వర్యుణా యజేతి ప్రేషితాః తేవయం
యజామహే యాజ్యాం పఠామః
వషట్కారశబ్దేన వౌషడిత్యేవం రూపోమన్త్రో వివక్షితః ♦ ♦ ♦ ♦ హవిర్దీయత
ఇతి-తస్య శబ్దార్థః

వికృతి యాగములలో చాతుర్మాస్యమని యొకటి యున్నటులను దాని నిర్వర్త్వంపునపుడు సాకమేధ (శాకమేధం) మను నొక యిష్టి యున్నదనియు దానిలో మహాపితృయజ్ఞమను ప్రకరణమున యజమానుడు కొన్నిక్రియలు ప్రాచీనావితిగ జేయుననియు అట్లుచేయుటలో సోమయాగమున పైనచెప్పిన ఆశ్రావయేత్యాది పదములకు బదులు ఈ క్రిందిపదములు చెప్పబడుననియు శ్రౌతమను ద్రావిడభాషాగ్రంథమున 155 పేరా క్రింది 7 వ నోటులోనున్నది.

ఆశ్రావయకు బదులు ... ఆస్వధా అనియు
అస్తు-శ్రౌషట్ ... అస్తుస్వధా అనియు
యేయజామహే ... యేస్వధామహే అనియు
42 మఖము = యజ్ఞము] వౌషట్ ... స్వధానమః అనియు—చెప్పుదురట,

43 ప్రవర్గ్యము = అగ్నిసోమీయ యాగమునందు రెండు మూడు నాలుగుదినములందు ప్రాతఃకాలములందును సాయంకాలములందును చేయబడు నొకకర్మ-ఇది యజ్ఞమునందు చాల ముఖ్యమయినది. యజ్ఞమునకు తల వంటిది.

"యత్ప్రవర్గ్యశ్శిరోవా ఏతద్యజ్ఞస్య"-తైత్తిరయారణ్యక 5-1.7.
ఒకానొక కారణముచేత యజ్ఞపురుషుని శిరస్సుపోగా ప్రవర్గ్యసహాయమున అది తిరుగ యథాస్థానమున సంధానము చేయబడినటుల యొకగాథకలదు. తైత్తరీయారణ్యక 5 1.7.

44 మేకపోతు = యజ్ఞపశువు.

45 యూపస్తంభము = యజ్ఞపశువును కట్టియుంచు స్తంభము.
ఇది చంద్ర, మారేడు, మోదుగు జాతులలో నొక కొయ్యగనుండును.

46 అంగహోమము = వపా యాగమయిన పిదప యజ్ఞపశువుయొక్క దేహమునుండి హృదయము, జిహ్వ, వృక్యములు (Kidneys) యకృత్ (Liver) లోనగు పదునొకం డవయవముల హోమములు.

వప = హృన్మేదస్తువపా వసేతికోశాత్ మేదోవిశేషః
సర్వోదరవ్యాపీ పోళీకాకారేతి శ్వేతవర్ణో వపేత్యుచ్యతే॥ (శ్రౌతపదార్థనిర్వచనము)

యజ్ఞపశు గర్భమునందు మేదస్సంబంధమయి (కొవ్వుసంబంధమగు) పోళీ ఆకారముగల వస్తువు. దీనిని ఇంగ్లీషున (great omentum) అని చెప్పుదురు.



# నా భర్తే — నా గురువు

శ్రీమతి జి. వి. లక్ష్మి

అమ్మా నాన్నకు ఒక్కతెనే కుమార్తెను కనుక చాలగారాబంగా చూస్తూయుండేవారు. నేను ఏది కోరితే అది ఆక్షణం ఎదుటఉండేది. అలాజరుగుతూండగా నాకేది అవుసరమో తెలియకుండా పోయింది. మానాన్న ఇంగ్లీషుభాష చదువుకోకపోయినా తెలుగుమాత్రం తెలియవలసినదానికన్నా ఎక్కువతెలియడంవల్ల లాభంకన్నా నష్టమే ఎక్కువయింది. ఊళ్ళో ఎక్కడ పోట్లాటవచ్చినా, రూల్సు తెలియనివాళ్ళకు తెలియచెప్పి మరీదాన్ని బలపరచేవాడు. ఆ తరవాత అవసరమైతే తాను కూడ సమర్థుడనని నిలచేవాడు. మొత్తంమీద మా నాన్న ఎంతచెప్పితే మా ఊళ్లోఅంత.

మా ఇంటిప్రక్క గుమాస్తాగారి కుమార్తెను చదివిస్తూఉండేరోజుల్లో మానాన్న లెక్చర్లు అంత, ఇంత కాదు. ఆడపిల్లకు చదువేంటి. గుమాస్తావట్టివెధవ... తన భార్య ఎంతచెప్పితే అంత. భార్యమాటలువిని ఆడపిల్లను చదివిస్తూన్నాడు. అని యీ విధంగా పాపము గుమస్తాగారిని వీధిలో రాగిచెట్టుక్రింద పడుకొని వర్ణిస్తూండేవాడు. ఆ రోజుల్లో నాక్కూడా చదువుకోవాలని ఉండేది. మానాన్న నడగడానికి ధైర్యంచాలక అమ్మతో చెప్పించాను. నాకు యీ కోరిక కలగటానికి కారణం గుమాస్తా గారికూతురేనని, మానాన్న విశ్వాసం. అడిగిందినేను. తిట్టింది పాపమా అమ్మాయిని. చూడండి మానాన్న ప్రయోజకత్వం.

అలారోజులు గడచినకొద్దీ నాకుకూడ చదువంటే తప్పుగాతోచింది. ఆఖరి కిలా అనుకొని తృప్తిపడే దాన్ని. "నాకేంఖర్మం. ప్రొద్దున్నపోయి, సాయంత్రానికి రావాలి, పాడుబడి. కూలివాళ్ళుకూడా ఇలాగే పోతరు." అని, ఆ చదువువిషయం మరచాను. తండ్రికి తగ్గకుమార్తెననిపించుకున్నాను.

ఒకరోజు ఎందుకో మానాన్నపిలచి ఇలా అన్నాడు. 'ఏదన్నా నేర్చుకోఅమ్మా ఊరకేఉండి ఏంచేస్తావు.' మానాన్న ఆ మాత్రం త్యాగంచేయ గలిగినందుకు చాలసంతోషించి, హార్మోనియం నేర్చుకొంటానని చెప్పాను. ఆ రోజుమొదలుకొని, హార్మోనియం అతిశ్రద్ధగా నేర్చుకొన్నాను. దానితో లేసులు, ఎంబ్రాయిడింగ్, మొదలైనవి నేర్చుకొంటూ ఉన్నాను. ఆ రోజుల్లో ఎవర్ని చూచినా లెక్ఖలేనట్లు కనుపించేవారు. అసలు మా ఇంటిప్రక్క అమ్మాయినిచూస్తే అసహ్యమేసేది.

ఇలాంటప్పుడు నాకు పెళ్ళిసంబంధాలు రాసాగాయి. ఎందరోవచ్చి నన్నుచూచి, అన్నీ బాగానే ఉన్నాయి. ఏం చదువుకుంది అనేవారు. మానాన్న ఒక చిన్ననవ్వుతో ప్రారంభించేవాడు. హార్మోనియం నేర్చుకుంది. బాగాపాడుతుంది. కుట్టుపనులన్నీ నేర్చుకొంది. ఇంకేంగావాలి - అనేపోజులో కూర్చునేవాడు, వారడిగింది మినహా, అన్నీ చెప్పడం చూచి, మెల్లిగా జారుకొనేవారు పెళ్ళిపెద్దలు. ఇలా కొన్నిసంవత్సరాలు నన్నుచూడటంతో సరిపోయాయి. అప్పటికి మానాన్న తనతప్పు ఒప్పుకోకపోగా, నన్ను, నా జాతకాన్నిగూర్చి తిడుతుండేవాడు.

మానాన్నకుతోడు మరొకవ్యగం నాకు మామ అయ్యే యోగంపట్టింది. కాలం, కర్మం కలసి వచ్చాయి. ఎలాగో మానాన్న బరువుతీరింది.

కాపరానికొచ్చినతర్వాత, అసలుజాతకం బయటపడింది. పాపము మావారుచదువుకొని డాక్టరయి ఇంటి

కొచ్చేసరికి మా మామగారు చేసినపనికి ఇప్పుడు ఆయనపడేబాధ చూస్తుంటే నా కెంతో భయంగా ఉండేది. పాపము ఇంటికివచ్చేసరికి "ఏమండోయ్ సాయంత్రం చాకలివస్తాడు, ఇప్పుడే బట్టలు పద్దు వ్రాయండి. మళ్లామరచి బయటకు వెళ్తారేమో!" అన్న మాటలు ఆయనచెవినిపడేవి. దానితో ఆయన జీవితాన్నిగూర్చి ఆలోచిస్తూ కూర్చునేవారు. కొన్నాళ్ళవరకు నాకు ఆయనబాధ ఏమిటో అర్థమయ్యేదికాదు. ఒకసారి ఇలాఅన్నారు. లక్ష్మీ! నన్నుగూర్చి నీ అభిప్రాయమేంటి! నాకేమి అర్థంకాక నవ్వసాగాను. ఆ నవ్వుకు ఆయనకు కోపము, విరక్తికూడకలిగింది. దానితో ఒకఅరగంట గ్రుక్కమింగకుండా చెప్పడం మొదలుపెట్టారిలా; నేను పుట్టడం, చావడంకూడా ఒకటేనట. నావల్లదేశానికి ఉపయోగంలేకపోగా, అపకారమేనట. నా కారణంగా తనజీవితంకూడ నాశనమయిందట. నాలుగు గోడలమధ్య పదార్థంలాగున్నానట. నాలాంటి స్త్రీ ఉండటం, స్త్రీజాతికేకళంకమట. ఇలా ఎన్నో నాకర్థంకానిభాషలో లెఖ్ఖలేవు.

ఆక్షణంలో నాబాధ వ్రాయలేను. కాని నాలో చీకటి అంతరించి ఒకవిధమైన వెలుతురు ప్రవేశించినట్లయింది. నాజీవితం కండ్లకు కట్టినట్లు కనుపిస్తూంది. వెంటనే మా వారి పాదాలమీదపడి క్షమాపణవేడుకొన్నాను. కాసేపు మానాన్న స్వార్థాన్నిగూర్చి తిట్టుకొన్నాను. చదువులేని ప్రతిస్త్రీకూడ ఇంతే కదా! తల్లిదండ్రుల మూఢవిశ్వాసాలకు గురిఅయితే ఆస్త్రీ ఇలాచీకటికొట్లో మసిఅయిపోవలసిందేగా! అబ్బఇలాంటి తండ్రులు, నిజంగా తండ్రులా! వాళ్ళ కుటుంబగౌరవంకొఱకు ఎంతమందిబిడ్డల్ని అన్యాయం చేసికొంటున్నారు! నాభర్తలాంటిభర్త అందరికీ లభించునా! యీ విషయంలో నాభర్తమీదప్రేమ రెట్టింపయింది. ఆయన తిట్టినవన్నీ నాకు దీవెనలయ్యాయి. ఆరోజు మొదలుకొని నాభర్తనాకు గురువయ్యారు. ఇది నాజాతక ప్రభావం. "నాసోదరీమణులందరికీ చెప్పబోయేదేమంటే నన్ను ఆదర్శంగా తీసికొని చదువే ముఖ్యంగాభావించి స్త్రీజాతికి గౌరవము, అభివృద్ధికలిగేటట్లు చేయమని" నాప్రార్థన.

# శారదానికేతనము
# రజతోత్సవము



మహాత్మాగాంధీగారి సహాయనిరాకరణోద్యమం కారణంగా బయలువెడలిన జాతీయవిద్యాసంస్థలలో శారదానికేతనం ఒకటి. అప్పట్లోయిటువంటి జాతీయవిద్యాసంస్థలు బాలురకూ బాలికలకూ చాలాఉద్భవమైనాయి. వాటిలో చాలాసంస్థలు ప్రభుత్వము వారిఒత్తిడికీ, ప్రజలనిరాదరణకూ, ద్రవ్యలోపానికీతట్టుకోలేక ఆగిపోయినాయి కాని శారదానికేతనంమాత్రం ఈఒడిదుడుకులన్నీగడచి రజతోత్సవంచేసుకొనేభాగ్యం పొందకల్గడం నిజంగా గొప్పవిశేషమనేచెప్పాలి. గతనెల 27, 28 తేదీలు (శని, ఆదివారాలు) గుంటూరు పౌరులకూ నికేతనపుపూర్వవిద్యార్థినులకు, ప్రస్తుతవిద్యార్థినులకు, ఉపాధ్యాయులకు, ఉపాధ్యాయినులకు నికేతననిర్వాహకులకు గొప్పపండుగదినాలు. ఆ శని, ఆదివారాలలో శారదానికేతన రజతోత్సవమూ నికేతన ప్రతిష్ఠాపకులైన ఉన్నవదంపతుల జన్మదినోత్సవమూ జరిగినవి.



రచయిత : శ్రీమతి
కనుపర్తి వరలక్ష్మమ్మగారు

27 వ తేదీ ఉదయం శారదాదేవి సహస్రనామపూజయూ, నికేతనస్థాపకురాలైన శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి విగ్రహప్రతిష్ఠయూ జరిగినవి. మధ్యాహ్నం బహిరంగసభ జరిగింది. ఈ సభకు నికేతన పూర్వవిద్యార్థినియూ, ఉన్నవదంపతులకు కడుగూర్చిన బిడ్డయూ నైన శ్రీమతి సంఘం లక్ష్మీబాయమ్మగారు అధ్యక్షతవహించారు. లక్ష్మీబాయమ్మగారు నిరాశ్రయంగాఉండి నికేతనంలో చేరి ఉన్నవదంపతుల ఆదరమున విద్యాబుద్ధులు గడించి చిత్రకళయందు ప్రత్యేకనైపుణి సంపాదించి ప్రస్తుతం హైద్రాబాదునందు ఒక పాఠశాలలో చిత్రకళోపాధ్యాయినిగా ఉండి నెలకు రెండువందలు వేతనముబడయుచున్న విదుషి. ఉద్వేగభరితమైన దేశభక్తి, త్యాగసహితమైన సంఘసేవ ఆమెలో లీనమై ఉన్నాయి. ఉన్నవదంపతులపై ఆమెకుగల ప్రేమ అపారం. నికేతనంపైనన్నూ, నికేతనస్థాపకులైన ఉన్నవదంపతులపైనను అత్యంతాభిమానముగల పూర్వవిద్యార్థిని, లక్ష్మీబాయమ్మ యిమ్మహోత్సవానికి అధ్యక్షురాలుగాఉండటం ఎంతో ఒప్పిదంగా ఉన్నదనిపించింది.

ఈ ఉత్సవానికి పెక్కు వూళ్లనుండి బంధువులు, మిత్రులు, నికేతనం పాతవిద్యార్థినులు, ఉపాధ్యాయినులు, శ్రీలక్ష్మీబాయమ్మగారిచే పెంచబడిన అనాధబాలికలు అందరూవచ్చారు. జరాభారమునకుతోడు వ్యాధిగ్రస్తయూనై వాలుకుర్చీలోపరుండే ఈ ఉత్సవంనడుపుచున్న శ్రీ లక్ష్మీబాయమ్మగారి ప్రత్యేక ఆహ్వానములే ఎల్లరినీ యింతగా ఆకర్షించినవి. అధ్యక్షురాలు తనఉపన్యాసంలో శారదానికేతనంతో తనకుగల సంబంధమూ, నిరాశ్రయరైన తన్నుఉన్నవదంపతులాదరించినతీరూ, నికేతనమున వసించుకాలములోకల్గిన అనేకసంఘటనలూ ఆర్ద్రహృదయంతో వివరించింది. పిమ్మట కార్యదర్శిరిపోర్టు చదువబడినది. తర్వాత శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు, అట్లూరి సీతమ్మగారు, కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఉపన్యసించారు.

పాఠశాలలో చదివే బాలికలకు బహుమతులు, యోగ్యతాపత్రాలు యివ్వబడినవి. తదుపరి నికేతనబాలికలచే కొన్ని వినోదప్రదర్శనాలు జరుపబడినాయి. అంతట శ్రీ మహాత్మాగాంధీగారిజీవితచరిత్ర నికేతనబాలికలచే బుర్రకథగా చెప్పబడినది. ఆదినుండియు నికేతనబాలికలకు వినోదప్రదర్శనములలో అత్యంతనిపుణులని పేరు గలదు. ఆ ఖ్యాతిని బాలికలీమారును నిలుపుకొనిరి. అన్నిటిలోవారు చెప్పినబుర్రకథ సభ్యులహృదయంలో హత్తుకొనిపోయింది. ఆ కథను ఆ పాఠశాల హిందీఉపాధ్యాయులు వ్రాసినారట. అక్కడవారేతయారు చేసినారట. కథనుచెప్పిన ముగ్గురుబాలికలు భాషాప్రవీణకు చదువుచున్నవారు, సంగీతమున హైయర్ పరీక్షల నిచ్చినవారు, కాగా, సంగీతసాహిత్యములు రెండూవారికథలో పెనవైచుకొని ప్రకాశించినవి. ఆ కథనడిచి నంతసేపు సభ్యులెల్లరు తదేకనిష్ఠతో విన్నారు. విన్నవారిలో యిర్వురు పదేసిరూకలు బాలికలకు బహూకరించగా అధ్యక్షురాలు రచయితకును, నేర్పిన ఉపాధ్యాయునకును, చెరిపదిరూపాయలు బహుమానమిచ్చినది.

మఱునాడుఉదయం ఉన్నవదంపతుల పాదపూజ జరిగింది. ఆదృశ్యం మఱపురానిది. ఉన్నవదంపతులకు ఒక్కడే కన్నకొమారుడు కాని వీరుగతఏబదేళ్లుగాచేసిన అపారసంఘసేవాఫలితంగా వారుచాలామంది బిడ్డలను సంపాదించుకొనిరి. వీరిచే పునర్వివాహము చేయబడినవారు. వీరిసహాయమున చదువుకొనినవారు, వీరిచే పెంపబడిన అనాథబాలికలు, వీరందరు, వీరిప్రియకొమార్తెలు, తమతమభర్తలతో బిడ్డలతో, ఈ ఉత్సవమునకు వచ్చారు. ఈ పాదపూజామహోత్సవము వారుచేతులార జరుపుకొనిరి. ఆ కొమార్తెలు ఈ వృద్ధదంపతులను కుర్చీలపై కూర్చుండబెట్టి పళ్లెరములలో పాదములిడి పాదప్రక్షాళనచేసిరి. ఆ పవిత్రోదకమును తమ

శిరసులపైచల్లుకొని, తమబిడ్డల తలలపైచల్లిరి. తమపైటచెంగులతో వారి చరణకమలములుతుడిచిరి. పుష్పాక్షతలతో పూజించిరి. కన్నులకద్దుకొనిరి. నూలుదండలు, పూలదండలు, నూత్నవస్త్రములు సమర్పించిరి. కుంకుమ తిలకములు పెట్టిరి. గంధమిచ్చిరి. లక్ష్మీబాయమ్మగారి పాదములకు పసుపుపూసిరి. తలలో పువ్వులుంచిరి. ఉభయులకు ప్రదక్షిణములుచేసి పాదములపై ప్రణమిల్లిరి. హారతులిచ్చిరి. ఆ ఆనందమునకు అంతులేదు. ఆ భక్తికి పారములేదు. ఆ వేడుకకు అవధిలేదు. ఎల్లెడల సంతోషంవెల్లివిరిసింది. భక్తిప్రేమలు తాండవించాయి. ఉన్నవదంపతులు వారిని అత్యంతవాత్సల్యంతో ఆశీర్వదించారు. అంతలో తమపాలకమాతయైన లక్ష్మీబాయమ్మగారు వ్యాధిగ్రస్తయై కదలమెదలశక్తిలేక కుర్చీలోపడుండి నోట మాటరాక కరుణామయ దృక్కులతో చూస్తూఉండడం వారికి స్ఫురణకు వచ్చిందో ఏమో ఎల్లరికన్నులు చెమ్మగిల్లినాయి. ఆమె గూడా కన్నులనీరు నింపుచూ ఆ బిడ్డలను నిమిరిచూచుకున్నది. ఆ అనాథబాలికలు తలిదండ్రుల నెరుగరు. వారే తల్లిదండ్రులు అయినప్పుడు వారి విషయమైన మోదఖేదాలు వారివికావా? ఒకానొకరోజున నేను లక్ష్మీబాయమ్మగారి సందర్శనార్థమై శారదానికేతనమునకు వెళ్లగా 'నాకుమార్తెలలో ఒకమ్మాయి రజస్వలైనది. ఆమెకు చిమ్మిరి త్రొక్కుతాము; ఒకమ్మాయి గర్భిణిలో ఉన్నది. ఆమెకు సూడిదచేస్తాము; పేరంటం చేసి వెళ్లుదువుగాని ఉండ'మని లక్ష్మీబాయమ్మగారనిరి. ఆవిషయం నాకుజ్ఞాపకంవచ్చి వాత్సల్యభరితమైన తమతల్లి రుజాపీడితయైయుండుట వారికి విచారంకలిగించదా అనుకున్నాను. కొమార్తెలు పూజించడం అయిన తర్వాత ఇతర విద్యార్థినులు, ఉపాధ్యాయినులు, ఇంకను బంధుమిత్రులు, అనేకమంది ఆ దంపతులకు నూత్నవస్త్రములు, పుష్పహారములు సమర్పించారు. పిదప అనేకమంది పంపిన అభినందనపద్యములు చదువబడినవి, లక్ష్మీనారాయణపంతులుగారి శిష్యుడు ప్రేమానందస్వామిగారు ఆధ్యాత్మికవిషయమైన ఉపన్యాసం చేశారు. అంతటితో ఉదయం కార్యక్రమం ముగిసింది.

ఆ సాయంత్రం నాల్గుగంటలకు మరలసభ సమావేశమైంది. అనేకమంది పంపిన అభినందనలేఖలు చదువబడినాయి. నికేతనవిద్యార్థినుల సంగీతకచ్చేరీ జరిగింది. పిమ్మట స్త్రీపండిత సత్కారంజరిగింది. శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు, అట్లూరి సీతమ్మగారు, కనుపర్తి వరలక్ష్మమ్మగారు మున్నగువారికిని నికేతనములో చదివి పండిత పట్టములుబడసిన పూర్వప్రస్తుత విద్యార్థినులకును, ఖద్దరు శాలువలు రజతపాత్రలు బహూకరింపబడినవి. అనంతరం శ్రీ పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు పద్యములు చదివారు. పిమ్మట తుర్లపాటి వెంకటేశ్వరరావుగారును భమిడిపాటి సత్యనారాయణగారును దిడుగు నరసింహారావుగారును ఉన్నవ దంపతుల త్యాగశీలతను దేశభక్తిని, స్త్రీవిద్యాభిమానమును ప్రశంసిస్తూ ఉపన్యసించారు. ఈ ప్రసంగములకు సమాధానమిస్తూ శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు, తాము విద్యలోగాని, ఉద్యోగంలోగాని, సేవాధర్మంలోగాని, దేశభక్తిలోగాని ఎందును అనర్హుల మనిపించుకోలేదన్నారు. తమకు ఆదిలో బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, దివ్యజ్ఞానసమాజము మున్నగువాటితో సంబంధం ఉండి తమ మనోవికాసానికి దోహద మిచ్చినా హిందూమతమునందే తమకు గాఢమైన ప్రేమగలదన్నారు. తమ తండ్రిగారు గొప్పవేదాంతులు కావడంచేత ఆ విధమైన జిజ్ఞాస తమకు పట్టుబడ్డదన్నారు. తమ తల్లి చిన్నపెద్దలందరితోను కలిసి మెలసి ఉండేవారు. ఆ అలవాటు తమకు వారివల్ల సంక్రమించినదన్నారు. తాము ఆదినుండి "కన్నదోయికి అన్యకాంతలడ్డంబైన మాతృభావము చేసి మరలువాడు." అను ప్రహ్లాదుని తత్వమును అలవర్చుకొన్నామనీ, అందువల్ల పునర్వివాహోద్యమం నడుపునాటికి తాను యిరవైనాలుగేండ్ల చిన్నవాడైయున్నప్పటికి తన

ఆశ్రయంలో అనేకమంది బాలవితంతువులున్నను తన మనసు నిశ్చలంగా ఉండకలిగిందన్నారు. ఆదిలో స్త్రీపునర్వివాహోద్యమంలో ప్రవేశించి స్వసంఘీయుల బహిష్కారాది కష్టముల పడునప్పుడేమి, రాజకీయములలో ప్రవేశించి చెరసాలవాసాదిక్లేశములు పొందునప్పుడేమి, శారదానికేతనము స్థాపించి నిర్వహించునప్పుడేమి శ్రీ లక్ష్మీబాయమ్మగారు తమకు సహధర్మిణిగానే ఉన్నారని, తనతోబాటు అనేక కష్టనిష్ఠురము లనుభవించారనీ, చెప్పారు.

అంత్యమున నిట్లు గంభీరముగ పల్కిరి:— "ఇప్పుడామె పెద్దవారైనారు. నాకా ఆధ్యాత్మికవిషయములందు అనురక్తియెక్కువైనది. సమర్థులైనవారు నికేతనము నిర్వహించడానికి లభించినచో జీవితశేషం భగవద్విచారముతో గడప వాంఛించుచున్నాను."

శ్రీ తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు 116 రూపాయలు, మునగపాటి రామకోటి పున్నమ్మగారు 116 రూపాయలు, దామరవల్లి మంగమ్మగారు 50 రూపాయలు విరాళమిచ్చారు.

పిమ్మట "దాదిపన్నా" అను హిందినాటకము "మీరాభాయి" అను తెలుగునాటకము, నికేతన బాలికలచే అత్యంత నిపుణతతో ప్రదర్శింప బడినవి. వందనములతో సభముగిసింది. పొరుగూరి నుండివచ్చిన వారికి భోజనాది వసతులు అత్యంతము చక్కగా యొనర్పబడినవి.

శ్రీపున్నవ దంపతులు అత్యంత ప్రేమతో ప్రతిష్ఠించి పెంచిమహోన్నతస్థితికి తెచ్చిన శారదానికేతనము చిరంజీవియై వెలయునట్లు భగవానుడనుగ్రహించుగాక ఉన్నవదంపతులకు ఈశ్వరుడు ఆయురారోగ్యములు ప్రసాదించుగాక.

---

# సంపాదకీయములు

## శ్రీ శారదానికేతనం రజితోత్సవము.

గుంటూరులో నడుచుచున్న శారదానికేతనం రజితోత్సవము జయప్రదముగా జరిగినదని వినుటకు పాఠకులందరును మాతోపాటు సంతోషిస్తారు. ఆంధ్రదేశంలో ఒకసంస్థ 25 సం॥ లు అవిచ్ఛిన్నముగా నడవడం విశేషమే. ఆకీర్తి శ్రీ ఉన్నవదంపతులది; వారు నికేతనంతో ఎంత మమేకమైపోయినారో— మా సోదరి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు వ్రాసిన ఉత్సవ వృత్తాంతమే తెలుపగలదు. శ్రీ ఉన్నవ దంపతులు చిరాయురారోగ్యములొంది ఈసంస్థనింకను వృద్ధికి తేవలయునని మన సౌహార్దమును వెల్లడింతుము గాక: 70 వ పగవడిలో చొచ్చి ఆధ్యాత్మిక చింతనలోపడుచున్న లక్ష్మీనారాయణగారునూ, నేటికే వ్యాధిగ్రస్తురాలై కదల; మెదల్, పలుక, జాలని స్థితిలోనున్న లక్ష్మీబాయమ్మగారునూ ఇంకెన్నాళ్లని దాని భారము వహింపగలరు? సమర్థులెవరైన చేబట్టితే మేమెడతొలగుతామన్నారు లక్ష్మీనారాయణగారు. "పరహితమతియుతులగు దొరలను నడుగుటయు నొడలి తొడవులు పుడమిన్" అన్నట్లు ఇన్నాళ్లుగా నీసంస్థకై ఆపుణ్యదంపతులు సంపన్నులైన సహృదయులకడ కొంగుబట్టి బిచ్చమెత్తిరి. గాంధీయుగంలో త్యాగుల బిచ్చపుజోలెలు హెచ్చైనవి; కావున అర్హమైన యిట్టివియు కొందరికి వెక్కసమగుచున్నవి. ఇప్పటికైన దీనికొక శాశ్వతనిధి, ఆస్తి, ఆదాయము ఏర్పడ వలెను. అట్టిదేర్పడుచో పరిపాలనాభారము వహించుటకు పోటీలేర్పడగలవు. కావున శ్రీపంతులుగారు తమఅభీష్టము నెరవేరవలెనన్నచో—ఈరెండు పనులు వహించగల పెద్దలనరయవలసియుండును. అట్టివారైదుగు రాంధ్రదేశమున లభ్యముకాజాలరా? ఇప్పటి కింతవరకు దీనిని కొనసాగించిన శ్రీ ఉన్నవదంపతులకృషిని అభినందించుచు ఈవృద్ధదంపతులకు విశ్రాంతినొసంగవలసిన బాధ్యతను ఆంధ్రులు గుర్తింతురుగాకయని హెచ్చరింతుము.

## హైదరాబాదులో స్త్రీల ఉపవాసం

హైదరాబాదులో ప్రజాభీష్టమును మన్నింపక ప్రభుత్వము హఠమువహించడము, వారి చనువున ఇతెహాద్ ఉల్-ముసల్మీన్ అనే ముస్లిం సంస్థ విచ్చలవిడిగా గ్రామాలపైబడి హిందువులను హింసించడం రోజూ పత్రికలలో చూస్తున్నాము. స్త్రీలనుకూడా అల్లరిపెట్టి అవమానములపాలు చేస్తున్నారనీ వింటున్నాము. ఈ విషయంలో అవసరమైన చర్యలు గైకొని ప్రజాశాంతి నెలకొల్పగల అధికారులకు సద్బుద్ధి ఏర్పడడానికై—హైదరాబాదుస్త్రీలు ఒక్క 1000 పైగా 24 గం॥ల ఉపవాసం చేసినారు. వీరి చర్య మేము హర్షిస్తున్నాము. చేయగల పురుషులు, ప్రభుత్వములు కర్తవ్యము నెరవేర్పజాలనప్పుడు, స్త్రీకి ఇంతకన్న గత్యంతరంలేనప్పుడు, స్త్రీ చేయదగినపని, చేసేపని, ఇదే. ఆ ఉపవాసం హఠానికి గాక వ్రతరూపంగాచేసినప్పుడు తప్పకుండా ఫలితం కొంతైనా కలుగకపోదని మా విశ్వాసం. కావున ఇందుకు వారిని అభినందిస్తున్నాము.

## పోలీసు శామ్యూల్ సాహసం కొనియాడదగినది

నెల్లూరి రైల్వేస్టేషనులో ఈ ఏప్రిల్ 5 వ తేదిన-ప్యాసింజరు కదల నున్నది. జనసమ్మర్దంలో నాలుగేండ్లబిడ్డ నెత్తుకొని ఒకతల్లి రైలెక్కుతున్నది. చంకలోబిడ్డజారి రైలుకమ్మలకు ప్లాటుఫారానికి మధ్య పడ్డది. తల్లిగొల్లుమన్నది; గార్డు ఈలవేశాడు; రైలుకదిలింది. భయభ్రాంతియైయున్న ఆ బిడ్డగతి ఏంకావాలి? ఏమాత్రం ఆ చక్రాలవైపు ఒరిగినా—శ్రీరామ రామ—ఇంకెక్కడిబిడ్డ? పోలీసుహెడ్ శామ్యూలుచూచాడు. వెంటనేబండికి ప్లాటుఫారానికి మధ్యకాలుదూర్చాడు. బిడ్డనుమృదువుగా, కాలితో ప్లాటుఫారానికి అడుగున నొక్కిపట్టి చక్రలవైపు మొగ్గకుండాచేశాడు. బండిపోతున్నది. గడిచిపోయే, ప్రతిపెట్టె మెట్టుకు తనకాలు ఒరుసుకొని పుండుఅవుతున్నా శామ్యూల్ పట్టువిడువలేదు; భయపడలేదు. బండిఆగింది. బిడ్డనెత్తి అల్లాడే ఆతల్లిచేతి కిచ్చాడు. ఏమాత్రం తబ్బిబ్బైనా—ప్రమాదమే. బిడ్డకేకాదు. బండివేగం విసురున ఆతనికాలు తేలిపోయినా, మెలికబడ్డా—గిరగిరతిరిగి ప్లాటుఫారంమీద తలపగుల పడే వాడే. నిజంగా అతని సమయస్ఫూర్తి, చొరవ, సాహసము, ధృతి కొనియాడదగినవి. ఈ చర్యచేత శామ్యూల్ తన శాఖకంతా కీర్తితెచ్చాడు. ప్రభుత్వమువారు ఇతనిని తగురీతి బహూకరించి ఉన్నతోద్యోగానికి, వీలైతే, ప్రమోషను చేయాలి.




### విజయరాణి

క్రొత్తగా విజయవాడనుండి వెలువడుచున్న తెలుగువారపత్రిక; సంపాదకులు శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు. వీరు విమర్శనార్థమై దీనిని మా కార్యాలయమున కంపినందుకు కృతజ్ఞులము. సంపాదకులు వస్తుతఃవర్తకవాణిజ్యములందు అభినివేశము, ప్రవేశముకలవారు; బాహుళ్యమున కాంగ్రెసువాదులు; తీవ్రమైన ఆంధ్రరాష్ట్ర వాంఛాపరులు; గ్రంథాలయోద్యమమున ముఖ్యులు; విద్వత్కవితా గోష్ఠీప్రియులు. కావున ఈ పత్రికలో ప్రతిఅక్షరమున వీరిమూర్తిని గాంచనగును. ముఖ్యముగా నేడాంధ్రదేశమును ఆందును కర్నూలు, కృష్ణామండలములను అలజడిపెట్టుచున్న హైదరాబాదు సమస్యపై వీరు సునిశితవిమర్శల గావించుచున్నారు. ఆంధ్రులందరు తప్పక ఆదరింపదగిన పత్రిక. విడిపత్రిక వెల రు 0-1-6 సం॥ చందా రు **5-0-0** వలయువారు విజయవాడకు పత్రికా కార్యాలయమునకు వ్రాయుడు.

### వర్కర్

ఆంధ్రరాష్ట్ర ట్రేడ్‌యూనియన్‌కౌన్సిల్ మాసపత్రిక; దీనిపేరునుబట్టియే ఇదికార్మికులకొరకు పుట్టినదని తెలియగలదు. దీనిధోరణి చూడగా నిదికమ్యూనిస్టు పక్షహస్తగతమనితోచును. ఇందలిభాష మరికొంత తేలికయైనగాని కార్మికులకు బోధపడదేమో! ప్రజాశాంతికి భంగకరముకాకుండ కార్మిక ప్రబోధమొనర్చునేని దీనికి మంచి భవిష్యత్తుకలదని చెప్పవచ్చును. సం॥ చందా రు 3-0-0 లు. కావలసినవారు విజయవాడకు పత్రికా కార్యాలయానికి వ్రాయండి.

### ఉష

తిరుపతినుండి వెలువడుచున్న తెలుగుమాసపత్రిక. తెలుగుసైక్లోస్టైలుయంత్రముననిది తయారగుచున్నది. ముఖచిత్రమున సైకిలో స్టైలులో—గోళాకారము, ఆందు సూర్యోదయము, కమలము, వీణ చిత్రింపబడియున్నవి.

దీనికి సంపాదకులు శ్రీ టి. పి. భాస్కరాచార్యులు, ఆకుండి వేంకటశాస్త్రిగారు. "లలిత సారస్వత పత్రిక" అని వ్రాసుకొన్నందుకు తార్కాణగా గద్యపద్యాత్మకమగు మంచి కావ్యములిందు లిఖింపబడినవి. శ్రీ రాయప్రోలువారి పద్యము తో లలితగా ప్రచురమైయున్నది. దీనిని మా విమర్శనార్థమంపిన పత్రికా సంపాదకుల నభినందిస్తూ త్వరలో నిది అచ్చుకెక్కాగాకయని ఆశించెదము.

## శ్రీ కన్యకా పురాణము

ఆర్యవైశ్యుల కులదైవతంబగు శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్రయని ప్రసిద్ధివహించిన గాధను సులభశైలి తెనుగున శ్రీ "కవిచంద్రులు", కోటసోదరకవులు, అష్టావధానులు రచించి విమర్శనార్థమై మా కార్యాలయమునకుపంపగా కృతజ్ఞతతో స్వీకరించితిమి. ఈ పురాణగాధ చారిత్రక పరిశోధనకు నిలువజాలదని కీ|| శే|| చిలుకూరి వీరభద్రరావు ప్రభృతులు చెప్పియేయున్నారు. అయినను సాంప్రదాయముగా చెప్పబడు గాధలను త్రోసివేయజాలము. కథమనోహరముగ నుండును గావున 'కథ' గా—హృద్యమమైనది. దీనిని పండితపామరులందరికి సులభగ్రాహ్యమగునట్లు విరచించిన శ్రీ కోట సోదరకవులు అభివందనీయులు. వదాన్యులు, వర్తకశిఖామణులునైన శ్రీ కర్లపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగారు శ్రీ కవిచంద్రులచే నీపురాణమును జదివించుకొని విని అర్థవేయినూటపదార్లతో సత్కరించిరని వినుటకెంతయు సంతసించుచున్నాము. దీనివెల రు 2-0-0 లు. వలయువారు ప్రతులకై "కవిచంద్రులు", కోటసోదరకవులు, అష్టావధానులు కనిగిరి నెల్లూరు జిల్లా అని వ్రాయుడు.

## విశాలాంధ్ర

సంపాదకులు శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు. మద్రాసు నుండే ఇది మాసపత్రికగా వెలువడుతున్నది. పేరును బట్టి ముఖ్యంగా ఆంధ్రప్రయోజనాలనిది బలపరుస్తుందని తోచును. కాని లోపలచూస్తే దీనికి జాతీయ అంతర్జాతీయ దృష్టులు కూడా లేకపోలేదని తెలుస్తుంది. అయితే వీరు ప్రధాన వ్యాసంలో ' "క్విట్" నినాదాన్ని మద్రాసులో ఆంధ్ర తమిళ నాయకు లొకరి పైకినింకొకరు గురి పెట్టుకొంటున్నారు.' అన్నారు తమిళనాయకుల్లవలె "మద్రాసు అంతా మాకే చెందవలె" ననే ఆంధ్రనాయకుని మేమింతవరకు చూడలేదు. సాలుచందా 3-0-0 వలయువారు 9 c సోలయప్ప మొదలివీధి మైలాపూరు, మద్రాసు అని వ్రాయండి.



Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# సర్వధారి — ఏం చేస్తుంది?

శ్రీ కంచిభట్ల ఆంజనేయసిద్ధాంతి

—✱—

"సర్వధారి" నేడే సూర్యోదయంతో ఆరంభించినది. క్రొత్తసంవత్సరం అంటే అందరికి ప్రేమే! ఈ సంవత్సరాసాంతంవరకు మహారాజు పదవి శనివహించాడు. ఇంకో మూడురోజులకు అంగారకుడు ప్రధానిగా వస్తూవున్నాడు. అందాక పాతప్రధాని ఇన్చార్జిలోవుంటాడు. అరవసంవత్సరపు వారాధిపతి సాధారణంగా ప్రధాని అవుతూవుంటాడు. అంగారకుడు అతి తీవ్రవాది; ముక్కోపి; శౌర్యబల ధైర్యస్థైర్యసాహససంపన్నుడు. ఇంకా అతను దక్షిణదేశానికి అధిపతియగుటయేగాక వస్తువులకు ధరలు పెంచేవాడు. శని ఉత్తరదేశ అధిపతి, ధరలు తగ్గించేతత్వం, బహుయుక్తిగలవాడు, అతిజాగుగ్రహం. వీరిద్దరివల్లనే లోకంలో గిరాకి, మందం అనేది ప్రతివాటిల్లో చూస్తూవుంటాం. "అబ్బో! శనికుజులు రాజప్రధానులట లోకం ఏమహాకష్టాల పాలౌతుందో?" అన్న కలకలం అందరినోళ్ల వింటున్నా. నేనుమాత్రం "అలాకాదు. భయపడనవసరంలేదు. శనికుజ రాజప్రధానిత్వాలు మంచేకూర్చుతవి" అంటున్నాను. మేఘాలకు[1], ధరల (అర్ఘ)కు[2], సైన్యానికి[3] చంద్రుడధిపతికావడం ఎంతో అనుకూలం. వర్షాలు సకాలంలో వస్తవి. ధరలుమాత్రం క్రిందమీద ఆరునెలలు ఇటూ ఆరునెలలు అటూ అవుతవి. ప్రభుత్వాల్లో మరొక పక్షంవారుకూడా స్థానాలను ఆక్రమిస్తారు. తెనుగువారు మరల మద్రాసు అసెంబ్లీ రాజకీయాల్లో గెల్చుతారు. పాకిస్థాను భీతి మాయమౌతుంది. అద్భుతములుగా మార్పులు జరుగుతవి. కోమటి వృత్తివారు (Merchants) ముందుకు వస్తారు. మీ వ్యాపారాలు ఆశ్వీజాదిగా ఆ ఆరుమాసాల్లో పూర్తిగా అనుకూలంగా సాగుతవి. రైతులముఖాల్లో సంతోషం ఇంకా పెరుగుతుంది. పంటలకుమాత్రం ఏ కొదవవుండదు. ధరలు స్వల్పంగా తగ్గవచ్చును. శుభకార్యాలు విరివిగా జరుగుతవి. చైత్రంమాసంలోని సూర్యచంద్రగ్రహణాలు ఒకవిధంగా మనదేశానికి వున్న అంతర్ద్వేష శత్రుత్వ ఈర్ష్యలను పోగొట్టి మైలపోయిన గాజువలె ప్రకాశింపచేస్తవి. ఒడుదుడుకులుండవు. ఆడపిల్లకాయలు మగపిల్లకాయలకంటె అన్నిటిలోకూడా మించుతారు. ఆశ్వీజంలో అమూల్య లోహాలు (వెండి బంగారు) ధరలు పూర్తిగ క్రమంగా తగ్గిపోతవి. ప్రత్తి గిరాకి. పశువులు, మృగములు పక్షులు అధికంగా వృద్ధిఅవుతవి. "సర్వధారి" అను పేరుగలసంవత్సరం కావున దీనిలో ప్రతివారికి ఏదో ఒకవృత్తివల్ల ధైర్యమూ, బ్రతుకుజీవనపు ఏర్పాటుకల్గితీరుతుంది. గృహోపకరణములు స్త్రీలు విరివిగా దొరలదేశాలనుంచి వచ్చిన వస్తువులను కొని నింపచూస్తారు; మగవారు కొంతఅడ్డంవేసినా! వారికోర్కెలు తగ్గింపలేరు. వార్తాపత్రికలు వంటచెరుకుకుబదులుగా వుపయోగిస్తారు. క్రొత్తపార్టీప్రచారం అతిగా లోకంలోసాగుతుంది. సంవత్సరాంతంలో బ్రిటీషువారిపాలనలో కొంత అలజడి ఆందోళనలు కలుగుతవి. ప్రముఖులు చాలామంది మాయమై ఆ స్థానాల్లో మరొకరు తలవనితలంపుగా ప్రత్యక్షంఅవుతారు. ఫిలింపరిశ్రమ సంస్కారంతో వృద్ధినిపొందుతుంది. కర్మాగారాలు విరివిగాపెంచుచు ధనాన్ని దొరలకు

చేర్చేవారికి, అతిబేకారుగాతిరిగే బ్లాకుఆఫీసర్లకు పెద్దదెబ్బతగులుతుంది. స్త్రీలకు కావలసినవన్నీ పొందడానికి ఆందోళనచేసి విజయం ఆర్జించవలసిన సమయంఇదే! మీకోర్కెలు డిస్కౌంటులేకుండా అన్నీ అనుకూలంఅవుతవి. రైళ్లలో జనులవత్తిడి చాలాభాగం తగ్గిపోతుంది. ఇంకోఎత్తుతో రైళ్లవారు మనుష్యుల బండ్లను బాగుగా రిపేర్లు ఈసంవత్సరం చేస్తారు. డబ్బుకు యీసంవత్సరాంతంల్లో బలే కసాలావచ్చే సూచనలున్నవి. మోటార్లు, యంత్రాలు విరివిగా ఇసుకవేస్తే రాలకుండా దిగుతవి. ఇన్‌ష్యూరెన్సు కంపెనీల వ్యాపారానికి దెబ్బతగులుతుంది.

శనికుజులు ఉగాదినాడు ఒకేరాసిలో కటకంలో బేటీ అయివున్నందున అరవవారు, ఆంధ్రులు చెరొకకావడిలో కూర్చొని కావడినడుపుట ఎంతో ముచ్చటకల్గిస్తుంది. వీరిలో వెనుకటి ఈర్ష్యలు పూర్తిగా చల్లబడుతవి. పరస్పర ప్రేమకు బునాదులు పెరుగుతవి. ఆంధ్రులు ఇనుపముక్కల యంత్రాలు విశేషంగా పొరుగువారికంటె కొనకపోతే ఆతర్వాత లాభం పోగొట్టుకోవడం వంటిది అవుతుంది. మేషానికి నాల్గవ స్థానమగు కటకంలో రాజుప్రధానులుండుటవల్ల ఈసంవత్సరం లెక్కలేనన్ని యిండ్లుకట్టిస్తారు. భూస్థితి, పెద్దకులాలకు తగ్గిపోతుంది, జమీందార్లకు, మహారాజులకు, హక్కులకు పెనుగులాటలో కొంతలాభం కిటుకుగా స్వల్పంగా దక్కుతుంది. బ్రాహ్మణులు వ్యాపార రంగంలో బాగుగా చొరవచేసుకొంటారు. దొరలదేశాల రాకపోకలుకల్గి చాలాలాభాలు మనదేశం పొందుతుంది.

ధాన్యాధిపతియగు బుధుడు కాయ ధాన్యాలు చౌకలో దొరికిస్తాడు, మంచివస్తువులు అన్ని సర్వసామాన్యంగా లభిస్తవి. ప్రజల్లో క్షీణించిన తేజోరక్తబలములు మరలసమకూడుతవి. యుద్ధానికి వెళ్ళివచ్చిన వారికి మరలపనులు యంత్రాగారాదుల్లో క్రొత్తగా కలిపిస్తారు. రేషను ఆఫీసుల్లో అధర్మంగా పనిచేసిన వారికి ఈసంవత్సరంలో చాలా అనారోగ్యము, అసౌఖ్యములు స్త్రీలచిక్కులు కలుగుతవి. క్రొత్త డిపార్టుమెంట్సు కొన్నిటినికల్పిస్తుంది ప్రభుత్వం. ప్రపంచపుమెప్పు హిందూదేశం పొందుతుంది. ప్రజల్లోని అల్లకల్లోములు లీడర్సు పోవడంవల్ల మరపునకు వస్తవి. సూర్యుడు ఆర్ద్రానక్షత్రంలో సోమవారంనాడు ప్రవేశించుటవల్ల యిండ్లకు రంగులు పాలిషులు, అలంకారముల వృద్ధియగును. క్రొత్తరకపు రేడియో, సంగీతపరికరాలు చూస్తాము, దొరల దేశాలకు చాలామంది వెళ్లివస్తూవుంటారు - మిథునకన్య మకర కుంభాల వారు విశేషంగా కుబేరులౌతారు. మేషవృశ్చిక వృషభతులకటకాలవారు సామాన్యంగా వృద్ధికివస్తారు. ధనస్సు సింహాలవారికి ప్రతిపనిలో చుక్కెదురు.

---

# శ్రీ సర్వధారి

మీకు సర్వశుభములు ఒనగూర్చుగాక

"గృహలక్ష్మి"

---